## అక్టోబరు విడుదల




1 దిండుక్రింది పోకచెక్క
విశ్వనాథ సత్యనారాయణ
కల్పనాత్మకమైన చారిత్రక నవల
రు 2/-



2 బ్రతికిన కాలేజీ
పాలగుమ్మి పద్మరాజు
మనోహరమైన హాస్యనవల
రు 2/-




3 సాక్షి
ముళ్ళపూడి వెంకటరమణ
సాక్షి చిత్రం పూర్తి సినిమా స్క్రిప్టు ఫొటోలతో
రు 2/-




4 గ్రహణం విడిచింది
ఒక ఆధునిక యువతి జీవిత కథ
రు 2/-

## తెలుగు పాఠక మహాశయులకు శుభవార్త!




ఎం.శేషాచలం అండ్ కో వారి
సరికొత్త పుస్తక ప్రణాళిక!

### ఎమెస్కో పాకెట్ బుక్స్!

మీ అందరి అభిమాన రచయితల రచనలూ సరికొత్త సైజులో - సరికొత్త కూర్పుతో అందమైన ముద్రణతో బొమ్మ ముఖచిత్ర అలంకరణతో నెలనెలా ప్రచురిస్తాము.

ఏదీ వెల రెండు రూపాయలు మించివుండదు! అక్టోబరు నెల మొదలై, నెలనెలా మొదటి తేదీ కల్లా నాలుగు పుస్తకాల చొప్పున వెలువడుతాయి.

ఇవి మీకు ప్రతిచోటా అందుబాటుగా దొరికేందుకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారు తగిన ఏర్పాట్లు చేస్తున్నారు. మీ దగ్గరలో వున్న బుక్ షాపులో గాని, పత్రికలు అమ్మే న్యూస్ ఏజంట్‌ని గాని అడగండి. వారి వద్ద లేవంటే తెప్పించి పెట్టమనండి. అదీ వీలుకాదంటే సరాసరి 'ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్‌కు రాయండి.

### పుస్తక విక్రేతలకు శుభవార్త!

పుస్తక వ్యాపారం అభివృద్ధి చేసుకొనడానికి ఇదే మంచి తరుణం
ఆకర్షణీయమైన ఏజన్సీ టరమ్స్!
వివరాలకు వెంటనే రాయండి
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతిరోడ్. సికింద్రాబాద్.

పాఠకులు - నాలుగూ ఒక్కసారిగా తెప్పిస్తే పోస్టేజీ ఉచితం. రు 8/- పూర్తిగా ముందే మనియార్డరు చెయ్యాలి. విడివిడిగా కావాలంటే పోస్టేజీ ఒకో ప్రతికీ పావలా అదనం. ఇదీ, పుస్తకం ఖరీదూ ముందుగా M.O.ద్వారా పంపాలి. రిజిస్టరు అయితే ప్యాకెట్ ఒకటికి ఛార్జి 60పై. కూపను →

విడి ఆర్డర్ల కూపను

TO ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్-

అయ్యా! మీ ఎమెస్కో ప్రచురణలు 1, 2, 3, 4 దిగువ అడ్రసుకి వెంటనే పంపండి. మీ నిర్దేశం ప్రకారం వీటికయ్యే మొత్తం సొమ్ము ఇవాళే మనియార్డరు చేశాను.

ఇట్లు

పేరు

అడ్రసు

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ * రాష్ట్రపతిరోడ్ * సికింద్రాబాద్. *

పాఠకులందరికి మా దసరా శుభా కాంక్షలు. — సం॥

# ఉత్తరాలు

## న్యూఢిల్లీ లేఖ

నాకెక్కువగా పత్రికలకి ఉత్తరాలు వ్రాసే అలవాటు లేదు. కాని 8–9–67 వ తేదీ సంచికలోని "న్యూఢిల్లీ లేఖ" చదివిన తర్వాత ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది.

ఈ న్యూఢిల్లీ లేఖ వ్రాసేవారెవరో కాని ప్రతి లేఖలోనూ జనసంఘాన్ని కాస్తో కూస్తో విమర్శించడమే తన ధ్యేయంగా పెట్టుకున్నారు.

ప్రతీ సంవత్సరం వేలాది నిమ్న కులాలవారి (అంటే మాల–మాదిగ మొ.వ.) ధనాశచూపించి వసతి, వైద్యసదుపాయం కల్పిస్తామని చెప్పి ఎంతో నేర్పుగా తమ మతంలోకి మార్చుకునే క్రైస్తవ మిషనరీలను విమర్శించడమే జనసంఘం తప్పా? అసలీ క్రైస్తవ మిషనరీలు దేశంలో వుండి ఏంచేస్తున్నాయి. ఏవో ఆశలు కల్పించి భారతీయుల్ని ఉద్ధరిస్తున్నామని చెప్పి వాళ్ళని క్రైస్తవ మతంలోకి మారుస్తున్నాయి. ఒకవిధంగా ఏ ఆసరా లేని వ్యక్తులను నేర్పుగా లోబర్చుకొని క్రైస్తవ మతం అవలంబించేట్టు చేస్తున్నాయి.

బీహారులో ప్రజలు ఆకలి చావులు చావకుండా కాపాడడానికి పిల్లల్ని రక్షించడానికి ఎక్కువగా క్రైస్తవ మిషనరీలే ముందుకు వచ్చాయని జై ప్రకాశ్‌నారాయణ్ అన్నారు. కాని ఏ ఉద్దేశంతో వారు ముందుకు వచ్చారో మీరు యితకు తెలియదా ఆకలితో మాడేవాళ్లని చేరదీసి క్రైస్తవమతము పుచ్చుకుంటే ప్రాణభిక్ష పెడతామని వాగ్దానాలు చేశారు. ఈ విషయం ఎన్నో పత్రికల్లో పడ్డది. పార్లమెంటులోనూ, దీనిని వాదోపవాదాలు జరిగాయి. ఈ విషయం, వ్యాసరచయితకు తెలియనే లేదా?

బీహారులో మనుషులు, ఆవులు చావకుండ కాపాడుతున్నాయి. ఈ క్రైస్తవ మిషనరీలు. కుష్ఠువ్యాధిగ్రస్తులకు ఆశ్రయమిస్తున్నాయి. బీదవార్ని చేరదీస్తున్నాయి. చక్కని భవనాల్ని నిర్మించి, విద్యార్థులకు శిక్షణ యిస్తున్నాయి. కాని ఇవన్నీ ఎందుకు చేస్తున్నట్టు? వాళ్ళ ఉద్దేశం ఏమిటి? మనదేశం బీదదేశం గనుక, మన ప్రజల్లో చాలా మంది బీదవారు కనుక, ఇవన్నీ ఆకర్షణలతో వారిని చేరదీసి సులువుగా క్రైస్తవులుగా మార్చి వేయవచ్చునని ఈ విద్యావిహీనం తింటున్న దేశాల భావన.

ఈ క్రైస్తవ మిషన్లు ఎందరినైతే చేరదీస్తున్నాయో, రక్షణ కల్పిస్తున్నారో వారిలో 70% వరకూ క్రైస్తవమతంలోకి మారుస్తున్నాయి. ఈ విషయం మాత్రం రచయిత సుళువుగా వుంచేశారు. ఈ క్రైస్తవ మిషనరీల విజయంచూసి, ముస్లిములు కూడా, హిందువులని తమమతంలో చేర్చుకోవాలనే కాంక్షతో "దో బాండ్ స్కూల్సు", ముస్లిం మిషనరీలు స్థాపిస్తున్నారు. వాళ్ళను గూడా జనసంఘం తరచుగా విమర్శిస్తూ వుంటుంది. మీకు తెలుసో లేదో కాని మా వూర్లో వున్న క్రైస్తవ మిషను 1913నుంచి 67వరకు సుమారు నాలుగైదు వేల మంది హిందువులను క్రైస్తవులుగా మార్చి వేసింది. అక్కడవున్న స్కూలులో ఒక పీరియడు బైబిలు, ఒక పీరియడు క్రైస్తవమతం గొప్పతనం కూడా బోధిస్తారట.

మోహన్, (లక్కెట్టిపేట)

* * *

8.9.67 సంచికలో శ్రీకృష్ణగారి "క్రైస్తవ మిషనరీలని దూషించే వారిలో సంఘసేవకులు ఎంతమంది?" అనే వ్యాసం వ్రాశారు. ఆయన వ్రాసిన వ్యాసంతో కొన్నివిషయములతో నేను ఏకీభవించలేదు. క్రైస్తవులు వారి స్వప్రయోజనాల కోసం యే ఒక్క హైందవ పుణ్యస్థలాన్ని పాడు చేయలేదని శ్రీకృష్ణగారు వ్రాశారు ఈ విషయంలో నేను వారితో ఏకీభవించను. ఎందుచేతనంటే 1963 లో వివేకానంద శతజయంతికి కన్యాకుమారి వద్ద నిర్మించిన వివేకానంద స్మారక శిలాఫలకాన్ని క్రైస్తవులు ధ్వంసం చేయలేదా? అలాగునే రామకృష్ణ మిషన్ తప్పిస్తే మరి ఏయితర హైందవ సంస్థ బీహారు క్షామపీడితులకు సహాయం చేయుటానికి ముందుకు రాలేదని వ్రాశారు. ఈ విషయంలో గూడ వారు తప్పుడు సమాచారం యిచ్చారు. ఎందుచేతనంటే భారతదేశంలో హైందవ ధర్మానికి ఆశాజ్యోతిగా వెలుగొందుచున్న రాష్ట్రీయ స్వయం సేవక సంఘము (ఆర్. ఎస్. ఎస్.) ఆధ్వర్యంలో నడుచుచున్న "క్షామపీడిత సహాయతా సమితి" బీహారు క్షామపీడితులకు దేశం నలుమూలల నుండి ధనధాన్య వస్త్రాదులు సేకరించి సహాయం చేయలేదా? ఈ సమితిని బీహారు ప్రభుత్వం గూడ గుర్తించినది. ఈ సమితి కార్యకలాపములు జూచి శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారు గూడ అభినందించినారు. అదియును గాక వ్యాస రచన చాల అవాస్తవికముగా నున్నది. విదేశీ క్రైస్తవ మిషనరీలు కొంతవరకు సహాయం చేస్తున్నారనే విషయం నేనంగీకరిస్తాను. కాని ఈ సహాయాన్ని ఆధారంగా తీసుకొని వారి మత ప్రయోజనాలకు వినియోగించుకుంటున్నారనే విషయాన్ని శ్రీకృష్ణగారు గ్రహిస్తారని భావిస్తాను.

(బడమ పాపారావు, బొబ్బిలి)

* * *

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 13—10—'67

ప్లవంగనామ సం॥ ఆశ్వయుజ మాసం శుద్ధ॥ ఏకాదశి

సంపుటము : 60 సంచిక : 6

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 72.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన : శ్రీ వెంకటరావు


కథలు :

| | |
|---|---|
| తెలపి | — 26 |
| సెలవుల్లో | — 40 |
| త్రి | — 52 |

సీరియల్ నవలలు :

| | |
|---|---|
| పూర్వాసంధ్యా ప్రవర్తతే... | — 46 |
| మట్టిబొమ్మలు | — 56 |

శీర్షికలు, వ్యాసాలు, సినిమా :

ఉత్తరాలు — 2, న్యాయిశిల్పి శిల — 6, మనోవికాశ్ — 8, మనాడో మనిషి — 10, వనితలకి వ్యాయామం — 12, ప్రశ్నావళి — 14, ధర్మపథం — 15. కుటుంబ నియంత్రణ మొదటి బహుమతి (వ్యాసం) — 16, రెండు బహుమతి (వ్యాసం) — 20, మూడవ బహుమతి (వ్యాసం) — 22, డాక్టర్ కబుర్లు — 23, యూత్ యూ పోల్యానా — 25, బాలసాహితి — 34, మెదడుకుమేత — 35, అవర్ ఫెయిర్ లేడీస్ — 36, వారఫలం — 38, విజయీభవ! — 61, ఒకవారం వినోదం — 63, రీటా పరియా — 64, చిత్రలహరి, సినిమాజీ కి — 66, ఆపీ — ఇసీ... 69.

# విద్యార్థులలో కుంటుపడుతున్న క్రమశిక్షణ

ఇప్పుడు ఢిల్లీ చైనా మార్కు సాంస్కృతిక విప్లవం మధ్య కొట్టుమిట్టాడుతూ వుంది. ఇక్కడ సంస్కృతి అంటే ఆదర్శం. ఆదర్శం అంటే నాయకత్వం. నాయకత్వం అంటే అధికారం! చైనాలో సంస్కృతి అంటే రాజకీయ పరిజ్ఞానానికీ, సూత్రాలకీ, ఒకవిధమైన రూపు. అది ఒక రాజకీయ మతం. ఢిల్లీలో రాజకీయ పరిజ్ఞానమూ లేదు, ఆదర్శానికి నియమ నిబంధనలూ లేవు. అయితే కామన్‌గా వుండేదిమాత్రం మూర్ఖత్వం?

చైనాలో యువకుల్ని రెడ్‌గార్డులుగా వుండడానికి తయారుచేస్తున్నారు. వారు ప్రజాగణతంత్రంలోని చర్యలకు బాధ్యులుగా వుండాలి అది అసలు నియమం. కాని, కార్యాచరణవేరు. ఇళ్ళల్లోకి చొరబడతారు, పుస్తకాలని నాశనంచేస్తారు, వర చిత్రాలని ధ్వంసం చేస్తారు, శిల్పాలని విరగ్గొడతారు ఎటువంటి వివక్షతాలేకుండా ఇష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తారు. రక్షణలేని ప్రజల్ని నానా యాతనలూ అనుభవింపజేస్తారు ముఖ్యంగా వయసుమళ్ళినవాళ్ళని దౌర్జన్యంగా హింసిస్తారు.

సాంప్రదాయంగా భారతదేశం కూడా ఒక 'సంస్కృతి'ని ఏర్పరచుకున్నది. ఇందులో విద్యార్థులంతా ప్రశాంతంగాను, క్రమశిక్షణతోను వుండాలని ఒక నియమం. నేర్చుకోవడానికి నేర్పుగల శక్తి కూడా వుండాలి. మహాత్మాగాంధీగారు లేవదీసిన నాటి మొదటి విశ్వాసరాహిత్య ఉద్యమం వరకు బాగానే నడిచింది. ఆయన పాఠశాలల్లోనుంచి కాలేజీల్లోనుంచి విద్యార్థుల్ని పిలిచి ఉద్యమాన్ని లేపారు. అప్పట్లో ఠాగోర్‌లాంటి జ్ఞానులు ఆయనని వారించారు. స్వంత ప్రయోగాలని ఎప్పుడలా గాంధీగారు పునర్‌ప్రయత్నించలేదు. ఇది ఆయన తెలివితేటలకు ప్రజ్ఞాశీలతకు ఒక ఉదాహరణ.

కొంచెం వెనక్కి చూస్తే, మహాత్మాగాంధీగారు జాతిపితగానే కాకుండా విద్యార్థుల క్రమశిక్షణా రాహిత్యానికి కూడా పితృపాదులుగా కనిపిస్తారు. మహాత్మాగాంధీగారు మనకిపెట్టిన భిక్షల్లో మరికొన్ని 'ధర్‌ణాలు', 'నిరాహార దీక్షలు' 'హర్తాళ్లా'ను. ఇక్కడ చిత్రమేమిటీ అంటే ఈ అస్త్రాలన్నింటినీ మహాత్మాగాంధీగారి శిష్యులు, మహాత్మాగాంధీగారి అనుచరులమీదనే ప్రయోగిస్తున్నారు!

అక్టోబరు మొదటివారంలో మహాత్మాగాంధీగారి జయంతి. వారి అనుచరులంతా కలిసి రాట్నాలమీద ఎడతెగని దారాలు తీసి 'అఖండ్' పాటిస్తారు. ఆ వారంలో ఖద్దరు ధర బాగా తగ్గించివేస్తారు. తొందర తొందరగా మటుమాయమై పోతున్న మద్యనిషేధ కాలంలో ధర్మాదిక విషయమైన ఉపన్యాసాలు కొనసాగిస్తారు!

మూకుమ్మడి పారిశ్రామికీకరణం గురించి మహాత్మా గాంధీగారు వల్లమాలిన అభ్యంతరం చెప్పారు. సందర్భవశంగా వారి అనుచరులు ఎవరి యిష్టంవచ్చినట్లు వారు ఈ ప్రయోగాన్ని ఉపయోగించుకుంటున్నారు. మన భారతీయులకంటె పాశ్చాత్యులు గాంధీగారిని ఎక్కువగా స్మరించుకుంటున్నారంటే సత్యదూరం అవదు!

ఇది ఒకవిధంగా పతనావస్థ. భారతదేశంలో సాంస్కృతిక విప్లవం, క్రిందటి సంవత్సరం తలఎత్తింది. అది ఎన్నికల సంవత్సరం కావడంతో ఎవరూ అంతగా పట్టించుకోలేదు. ప్రధానమంత్రి దానిని ప్రజాస్వామ్యంలో ఒక మెట్టుక్రింద జమకట్టి సమర్థించారు. ఎన్నికల సమయంలో ప్రజాస్వామ్య జీవితం శాంతి భద్రతల్ని విచ్ఛిన్నం చేయడం సహజమే అన్నారామె! వారి వంత పాటగాళ్ళు, పత్రికలూ అవును, నిజమే! అన్నాయి. అమెరికాలో ఎన్నికలకు ముందు జరిగిన అల్లర్లను దృష్టికి తీసుకువస్తూ ప్రధానమంత్రి అభిప్రాయం సరయినదే అన్నారు. కాంగ్రెసు నేతలు, వారి స్త్రీజనమూ, అక్రమంగా వ్యవహరించే విద్యార్థుల్ని వారి స్వంతపిల్లల్లా చూసుకున్నారు!

మన భారతదేశ విశ్వవిద్యాలయాలవంటి ఒక విచిత్రమైన విషయం ద్యోతకమవుతోంది. ప్రశ్నపత్రం కఠినంగావుంటే దానికి నిరసన, తక్కువ మార్కుల్లో పాస్ చేయాలని మరో ఘెరావో, ఇలాంటివి చదువుకంటే ముందు ముఖ్యమయిపోయాయి. మన విద్యార్థుల భవిష్యత్తును దూరదృష్టితో చూసినట్లయితే ఇటువంటి నడత గొడ్డలిపెట్టు. విదేశ విశ్వవిద్యాలయాల్లో మన విద్యార్థుల పరువుపోతుంది.

ఢిల్లీ విశ్వవిద్యాలయంమీద ఆందోళన లేవదీసిన వాళ్ళలో చాలమంది అసలు నష్టపోయిన వారికంటె పైవారే ఎక్కువగా వున్నట్టు తెలుస్తున్నది. 'గట్టిగా చర్య తీసుకుంటాము' అని ఢిల్లీ విద్యార్థి నాయకుడు శ్రీ సుభాస్ గోయల్ అన్నాడు. మొత్తం విద్యార్థి లోకమంతా అతనికి మద్దతు ఇస్తున్నదట! ఫెయిలయిన విద్యార్థులు ఆందోళన జరిపితే కొంత సహజంగా వుండును. అది అందరి సమస్యగా ఎంచుకుని విద్యార్థులంతా తప్పుదారిన నడుస్తున్నారు. విద్యార్థి నాయకులు, విద్యార్థి సంఘాలు నిర్వర్తించవలసిన విధులు ఇవేనా? విశ్వవిద్యాలయాల్ని ఫ్యాక్టరీలుగా మార్చి అందులో డిగ్రీలను ఉత్పత్తిచేయమనా, వీరుకోరేది?

విద్యార్థుల ఇలాంటి ఆందోళనలకు విశ్వవిద్యాలయాలు లొంగిపోయినట్లయితే, భారత విశ్వవిద్యా

లయాల ప్రమాణం పడిపోతుందన్న మాట ఖాయం. దానికి విలువా పోతుంది. అప్పుడు విద్యార్థులే వారి చదువు పంథ్వాకు సమానమయిన కోర్సుల్ని నిర్ణయించుకుంటారు. ప్రశ్నా పత్రాలను వారే తయారు చేసుకుంటారు. వాటిని వారే పరిచూసుకుని ఫలితాలను ప్రకటించుకుంటారు! విశ్వవిద్యాలయాలకు మాత్రం డిగ్రీలను పంచిఇచ్చే అవకాశాన్ని కలిగిస్తారు. మిగతా వ్యవహారమంతా విద్యార్థులే స్వయంగా చూసుకుంటారన్న మాట!

స్వతంత్రం వచ్చిన దగ్గర్నుంచీ 'కోర్సు'లు చిన్నవయి పోయాయి. ఒక తెలివయిన విద్యార్థి పరీక్షలో పాస్ కావడానికి ఆరు నెలలు కృషి చాలు అంటున్నారు. అందుకని, బస్సుల మీద రాళ్లు విసరడానికీ, తరగతి గదుల్లోని కుర్చీలను, బల్లలని తగలబెట్టడానికి అతనికి బోల్డంత సమయం వుంటుందన్న మాట!

ఢిల్లీలోని కొన్ని క్రయిస్తవ పాఠశాలల్లో 'పేరెంట్స్ డే' చేస్తున్నారు. కాలేజీల్లో ఇటువంటి సమావేశాల్ని ప్రవేశపెట్టి తల్లిదండ్రులకి — ఉపాధ్యాయులికి మధ్య అన్యోన్యత నేర్పరచినట్టయితే విద్యార్థుల కల్లోలం కొంత సర్దుమణుగుతుంది. రాజకీయ పార్టీలను విద్యార్థుల విషయాల్లో కలగజేసుకోకుండా చేయడం ముఖ్యం. క్రితం ఎన్నికలకి ముందు రోజుల్లో విద్యార్థుల్ని రెచ్చగొట్టిన మహానాయకుడు విద్యా మంత్రి కావడానికి, లేదా పోలీసుశాఖకి ఆధిపత్యం వహించడానికి ముందుకు రావడంలో ఆశ్చర్యం లేదు. అటువంటి వీరు ఆందోళనల్ని స్థిరంగా వుంచాలని చూస్తున్నారు. ముఖ్యమంత్రుల, విద్యా మంత్రుల సమావేశాన్ని భాషా వివాదాన్ని అధికం చేయడానికి బదులు, విద్యార్థుల అక్రమ చర్యల్ని అరికట్టడానికి ఉపయోగించినట్టయితే ప్రజల సొమ్ము కొంత వృధా కాకుండా వుండి వుండేది!

విద్యార్థుల అన్యాయ ప్రవర్తననిగాని, పెద్దవాళ్ల అక్రమ ప్రవర్తననిగాని చూస్తూ వూరుకోవడం ప్రభుత్వం పనికాదు. ఇవాటి విద్యార్థి రేపు ప్రొద్దున్న కొందరి పిల్లలికి తండ్రి అవుతాడు. విద్యార్థులుగాని, పెద్దలుగాని అన్యాయంగా వర్తించడం సహించరానిది వారు అలా నడచినప్పుడు కఠినంగా శిక్షింపబడతారని తెలుసుకున్నట్టయితే, మరి ఆటువంటి అక్రమాల జోలికి పోనేపోరు.

పోలీసుల అధికారాన్ని ప్రభుత్వం నాశనం చేసినందుకుగాను మనం కమ్యూనిస్టులకు అభినందనలు తెలియజేయాలి. ఇవ్వేళ జరుగుతున్న విధంగా, ప్రభుత్వం కలుగజేసుకుని విచారణ సంఘాల్ని ఏర్పరచి పోలీసులని వాజెమ్మలని చేస్తున్నప్పుడు-పోలీసులు గూండాల నుంచి పౌరుల్ని రక్షించవలసినంత మంచిపని ఎందుకు చేయాలి?













జ్ఞాపకశక్తి పోయిన మనిషి ఎవరో తెలుసుకొనే దానికి ప్రయత్నించారు డాక్టర్లు.

తప్పిపోయిన వారి వివరాలు ఒకటి తర్వాత, ఒకటి ఎన్నో చూపించారు.

'హ్యూగో డ్రాక్స్'
''నా పేరిదే ననుకుంటాను!''










పేరు గుర్తువచ్చిన ఈ మనిషి క్రమంగా తన భయంకరమయిన గాయాలనుంచి కోలుకున్నాడు.

శాంతి నెలకొల్పిన రెండవ ఏట ఆస్పత్రిని వదిలి వెళ్లిన హ్యూగో డ్రాక్స్ మూడు సంవత్సరాల దాకా మళ్లీ కనిపించకుండా మాయమయ్యాడు......










'కొలంబయిట్ (లోహం) ఫ్యూచర్స్ పౌ. 84.10 ......'

'విచిత్రలోహం' కొలంబయిట్ చేజిక్కించుకోగానే మళ్లీ కనిపించాడే హ్యూగో డ్రాక్స్— అతని సంగతే అందరూ మరిచిపోయారు.''

టాంజియర్స్ అతని హెడ్‌క్వార్టర్స్. జెట్ విమానాలకి కావలసిన కొలంబయిట్ చాలా చేజిక్కించుకుని బాగా లాభాలు చేసుకున్నాడు......







త్వరలో హ్యూగో డ్రాక్స్ అద్భుత జీవితం గురించిన కథలు ప్రపంచ మంతటా పాకడం మొదలు పెట్టాయి. యుద్ధానంతరం వెలుగులోకి వచ్చిన కోటీశ్వరులందరిలోనూ 'తాజావ్యక్తి', గొప్పవాడూ.....

ఒకనాడు ఇంగ్లండ్‌కి మార్చుకున్నాడు బస.....










'డ్రాక్స్ 100,000 పవున్ల విరాళం—

'ఈ ఏడు డెర్బీలో గెలిచిన గుర్రాన్ని సర్ హ్యూగో తీసుకువస్తున్నా రిదిగో—'

బాగా డబ్బు ఖర్చు పెట్టేవాడు. జనానికిది బాగా నచ్చింది.










హ్యూగో డ్రాక్స్ రసికుడనే పుకార్లు పుట్టాయి కాని ఇవి అతని గ్లామర్‌ని మరింత ఎక్కువచేశాయి.

ఒక రోజు రాణిగారికి ఆశ్చర్యకరమయిన ఉత్తరం వచ్చింది.
'నేను సాహసించి రాసేదేమంటే—'

కోటి పవున్లు ఇచ్చేసి తన కొలంబయిట్ వాటాలు అన్ని వదులు కుంటాడుట, ఈవిధంగా బ్రిటన్ చోదితాస్త్రాల బలం ప్రపంచంలో కెల్లా అధికం అవుతుంది.....

(ఇంకా ఉంది)

ఇద్దరికి వండుకున్నప్పుడు మూడో మనిషివస్తే పర్దుకు తినవచ్చు. ఇద్దరి మధ్యకి వండంటి పాపడువస్తే ఎంతో సంతోషంగా ఉంటుంది. కాని ఇద్దరి మధ్యకి మూడోమనిషివస్తే పచ్చని చెట్టుకి చీడపురుగు పట్టినటు అవు తుంది.

ఒక సోదరి హృదయం విప్పి దుఃఖ న్నంతా వెళ్ళపోసుకుంటూ ఓ లేఖ వ్రాసింది. దాని సారాంశం యిదే — మూడోమనిషి. అది చదివాక ఈ విషయం గురించి ఆలోచిస్తే — ఆ ఆలోచనలకి అంతు అంటూ ఉండదు. అలాంటప్పుడు ఏంచేయాలి ? అన్నది పెద్ద యక్షప్రశ్న. ఎదటపడి దెబ్బ లాడాలా? అలిగి పుట్టినింటికి వెళ్ళి పోవాలా? ఇంట్లోనే ఉండి శీతల యుద్ధం సాగించాలా? మాటి మాటికీ అవమానిస్తూ, ఎత్తి పొడుస్తూ కనువిప్పు కల్గేలా చేయాలా? ఏం చేయాలి?

'మాకు వివాహం జరిగి అప్పుడే పదేళ్ళు దాటి పోయింది. ముగ్గురు పాపలున్నారు. ఇన్నాళ్ళూ ఎటువంటి ఒడుదుడుకులూ రాలేదనను. వచ్చాయి. కాని అవి మా జీవితాలని పునాది నుంచి పెకలిస్తాయన్న భయం ఎప్పుడూ వేయలేదు నాకు.' అంటూ చెప్పు కొచ్చిందా సోదరి. పది సంవత్సరాల వైవాహిక జీవితంలో ఎన్నో ఒడి దుడుకులను తట్టుకొన్నాను. డబ్బు యిబ్బందులు, పిల్లలకీ నాకూ రోగాలు ఇతర చింతలు ఎన్నో చూశాను. కాని ఇప్పటి స్థితిలో ఎప్పుడూ లేను. చాలా కాలం పాటు నాకీ సంగతి తెలియనే లేదు. ఇదివరలో కంటే మా వారు ఎక్కువ మక్కువగానూ ఆదరంగానూ కూడా ఉంటున్నట్టు కూడా అనిపిం చింది నాకు. కాని రాను రాను అడపా తడపా రాత్రిళ్ళు లేటుగా రావడం, చిన్న అబద్ధాలు చెప్పి టూరుకు వెళ్ళా ననడం మొదలు పెట్టారు. అవి కూడా నేనంతగా పట్టించుకోలేదు.




ఎందుకంటే పిల్లలంటే వారికి ప్రాణం. వారిని చూడకుండా ఉండలేరు వాళ్ళు. వాళ్ళని చూడకుండా ఆయనా ఉండలేరు. కాని తెలిసినవాళ్ళు ఒకళ్ళూ అరా చెవులు కొరుక్కోవడంతో ప్రారంభం అయింది నా అన్వేషణ. నెమ్మదిగా నే తెలుసు కున్నాను—నిజంగానే వారి జీవితంలో మూడో మనిషి ప్రవేశించిందని. ఆ విషయం తెలిసిన రోజు నేనెంత కుమిలి పోయానో ఆ భగవంతుడికే తెలుసు. నావల్ల వచ్చిన లోటేమిటి? మన సంసారంలో మీకు లభించని దేమిటి? అని అడిగాను. వారికి కోపం రాలేదు. కాని నే విన్న సంగతి అబద్ధం. 'నా కింకో స్త్రీతో సంబంధంలేదు' అని మటుకు వారు అనలేదు. నే నేం చెయ్యను?' అంటూ వాపోయింది.

నిజమే తమదాకా వచ్చేదాకా ఎంతటి అభూత కల్పననైనా నమ్మ తారు. తీరా తమ పట్ల ఇటువంటి ప్రమాదాలు సంభవించి నప్పుడు—'ఛీ అలా ఎందుకు జరుగుతుంది?' అంటూ నమ్మకుండా ఉండాలని ఎంతైనా ప్రయత్నిస్తారు. ఇటువంటి అదను చూసే స్నేహితులు చిట్కా వైద్యాలు చెప్పడం ప్రారంభిస్తారు. 'దెబ్బలాడి ఇటో అటో తేల్చుకో' అని ఒకరు బోధిస్తే. 'సాధించుకు తింటేసరి, నాలుగు రోజుల్లో సద్దుకుంటారు' అని యింకొకరు బోధిస్తారు.

ఒక సంగతి జ్ఞాపకం పెట్టుకోవాలి. మానవ జీవితాలలో అన్నిటికంటె సున్నితమైనదీ సన్నిహితమైనదీ— భార్యా భర్తలమధ్య సంబంధం. దానిలో మూడో వారికి చోటులేదు. ఒకవేళ ఎవరైనా అలా చోటు చేసుకున్నా అది తాత్కాలికమేగాని శాశ్వతం కానే కాలేదు. అందుచేతనే వీరి మధ్య మధ్యవర్తిత్వం వహించడం అన్నది చాలా డేంజరస్ పని. భార్యా భర్తలు తమకి తామై తమ మధ్య ఏర్పడిన భేదాభి ప్రాయాలని చక్కపరుచుకోవాలి. ఒడి దుడుకులని సరిదిద్దుకోవాలి. పైవారి కొపని అప్పగిస్తే అది పైవారి అభి ప్రాయంగానే ఉంటుంది కాని తమది కాదు.

ఓర్పుగా నేర్పుగా భార్య ఈ పరి స్థితులలో ప్రవర్తిస్తే తప్పించి కార్య సిద్ధి జరగదు. వెనుకటి కంటె ఆదరంగానూ ఆప్యాయంగానూ గృహ సీమ తయారు చేయ కల్గాలి ఎంత త్వరగా యింటికి వచ్చి పోతే అంత త్వరగా మనస్థిమితం చిక్కుతుందన్న నమ్మకం భర్తకు కల్గించాలి అంతేగాని మనస్సులోని బాధతో యింటిని నరక ప్రాయంగా తయారుచేస్తే బీటలు వారిన సంసారం అతుక్కోవడం కష్ట సాధ్యం అవుతుంది. నిజమే మనస్సును మండించే యిటువంటి స్థితిలో మండి పడ్డం సులువు. గట్టిగా దెబ్బలాడు కోవడం సులువు. ఏడవడం సులువు, యిల్లు వదిలి వెళ్ళి పోవడం సులువు, కాని గృహిణి ఉద్దేశ్యం తన సంసారం తిరిగి చిగిరింప చేసుకోవడమే అయితే సులభ మార్గం గమ్యం చేర్చదు. నిప్పుని ఒడినకట్టి చిరునవ్వుతో ఉండ గలగాలి. ఫరవాలేదు. కాని మీ తప్పు మీరు గ్రహించి తిరిగి వచ్చారు అంతే చాలు' అన్నది చెప్పీ చెప్పనట్టు—తన ప్రవర్తన ద్వారా వ్యక్తపరచాలి. ఇది

(69 వ పేజీ చూడండి)

# వనితలకి వ్యాయామం




తగినంత పరిశ్రమ దేహసౌష్ఠవానికి పెట్టనికోట. దీనివల్ల శరీరం గట్టిపడి అందంగా తయారు కావడమేకాదు — హుందాగా తల ఎత్తి నడవడం కూడా వస్తుంది. అందమైన వారికీ, కాని వారికీ తేడా అదే కదా? బిగపట్టిన మెడా, భుజాలూ అనవసరమైన గూని తెచ్చి పెడతాయి. తగిన బలం లేని కండరాలు కొవ్వు పేరుకోనిస్తాయి. ఈ వ్యాయామం వారం రోజులపాటు అలవాటుగా చేస్తే హాయిగా ఉన్నట్టు తోచడమేకాదు అందంగా నడవడం, నిటారుగా నిలబడ్డం కూడా అలవాటు అవుతాయి. రోజుకో పదినిముషాలు ఈ వ్యాయామం కోసం ఖర్చుచేయడం అవసరం.

మొదట్లో అతిగా చేయకూడదు. ఇంట్లో నడవడం, ఇంటిపనులు చేసుకోడం లాంటి పనులు చేసేవారు రోజూ, ఈ కదలికలు ఒకటి రెండుసార్లు చేస్తూ, వారాంతానికి ఐదుసార్లు చేసేదాకా రావచ్చు. తగిన భోజనంతో పాటు ఈ వ్యాయామం జత చేస్తే డయిట్ మార్చుచేయకుండానే తగిన బరువులో ఉండవచ్చు.

## అందమైన మెడ

ఎక్కడైనా కూర్చుని చేయడానికి అనువైన నాలుగు కదలికలివి. తల బాగా వెనక్కి వాల్చండి. తరువాత ముందుకి వాల్చండి. నోరు తెరచి వుంచితే మెడ నరాలు నెప్పి పెట్టవు. గెడ్డం క్రింద కండ కూడా కరిగిపోతుంది. తరువాత, మెడ ఒక పక్కకు తిప్పి, వెనక్కు ఎంత వీలైతే అంత చూడడానికి ప్రయత్నించండి. తరువాత రెండోవైపు తిరగండి. ఇలా అయిదు



సార్లు చేయాలి. ఇవి చేసేటప్పుడు భుజాలు కదలనియకూడదు. మనిషంతా పక్కకు తిరగకూడదు.

## అందమైన భుజాలు

నిలబడి చేయడానికి అనువైన రెండు కదలికలు ఇవి. నిటారుగా నిలబడి, ఒక భుజాన్ని పైకెత్తి చెవిదాకా రానివ్వాలి. చెయ్యి కదలకూడదు. ఇలా ఒకొక్క భుజం అయిదుసార్లు చేయాలి. తరువాత రెండు భుజాలూ ఒకేసారి ఎత్తి వేయాలి. ఇలా చేసేటప్పుడు మెడ ఎంత వీల్తే అంత



వెనక్కి వాల్చాలి. దిగుభుజాలకి, గూనెగా తయారయే భుజాలకీ ఇది విరుగుడు.

## అందమైన చేతులు

నిలబడి చేసే మూడు కదలికలు ఇవి. రెండు చేతులూ బారగా జాచి మూడు దాకా లెక్కపెట్టి చేతులు దించండి. ఈ చాపడం ఎంత దూరంగా వీలైతే అంతగా జాచాలి. అప్పుడే కండలు బిగపట్టి పనికల్పుతుంది వాటికి. అయిదుసార్లు చెయ్యాలి. తరువాత చేతులు జాచి, అర చేతులు ఎదురు వైపు వుండేలా ఉంచి, నెమ్మదిగా ఆ అరచేతులు పైకి వచ్చేలా తిప్పాలి. మనిషి కదలకూడదు. భుజాల దగ్గర నుంచి చేతులు



అటూ ఇటూ ఎవరో పట్టి లాగుతున్నంత బలంగా జాపి చేయాలి. ఇది అయిదుసార్లు చేయాలి. వీటితో జబ్బలు తగ్గుతాయి. ముంజేయి అందంగా తయారు అవుతుంది.

## పల్చని పొట్ట

నిలబడి చేయాలిది. పొట్ట ఎంత లోపలికి పీల్చితే అంతలోపలికి బిగబట్టాలి. తరువాత నడుము దగ్గర నుంచి ముందుకి వంగాలి. పదిదాకా లెక్కపెట్టి నెమ్మదిగా



ఊపిరితీస్తూ నిలబడాలి. అయిదుసార్లు చేయాలి. ముందుకి వంగినప్పుడు మోకాళ్లు వంగనీయకూడదు. ఇది అలవాటుగా చేస్తే పొట్టమీది కండలు ముడతలు తగ్గిపోతాయి.

## తిన్నని వీపు

చాలా మందికి కోరెక్కల మధ్య బాగా కండలు పెరిగి జాకెట్టులోంచి అందవికారంగా కన్పిస్తాయి. అవి తగ్గడానికే ఈ వ్యాయామం. మోచేతుల దాకా చేతులు వంచి వాటిని వీలైనంతగా వెనక్కి తోయడానికి ప్రయత్నించండి. తరువాత నెమ్మదిగా భుజం ఎత్తుదాకా పైకి తెండి. ఇలా అయిదుసార్లు చేయాలి.





## అందమైన చనుగవ

పాతిక పైబడ్డ ప్రతి స్త్రీ ఈ వ్యాయామం తప్పక చేయాలి. ఎడం చేతిలో కుడిచేతిని కుడిచేతిలో ఎడం చేతిని పట్టుకోవాలి. బలంగా పట్టుకుని కండరాలు బిగపట్టి ఒక చేతిని ఇంకో చేతో తోస్తున్నట్టు మోచేతులదాకా నెట్టుకుంటూ రావాలి. బలంగా ఇలా నెట్టుతూన్నట్టు తోయడం వల్ల వక్షస్థలంలోని కండరాలు బిగదీసుకున్నట్టు అవుతాయి. అయిదు సార్లైనా చేయాలి.



## అందమైన నడుము

నిలబడి రెండు చేతులూ నిదారుగా తల పైకి ఎత్తాలి. తరువాత నడుము దగ్గర



నుంచి ముందు ఒక పక్కకి, తరవాత రెండో పక్కకి వంగాలి. మోకాళ్లు వంగనీయకూడదు. సాధ్యమైనంతగా శరీరాన్ని సాగతీసి వంచాలి. ఒక్కొక్క పక్క అయిదు సార్లు చేయాలి.

## అందమైన జఘనం

గోడని ఆధారంగా చేసుకుని నిలబడి చేసే రెండు కదలికలు ఇవి. గోడకి ఆను గాని నిలబడి మోకాలు తిన్నగా పైకి ఎత్తాలి. తరవాత ఎంత వీలైతే అంతగా

(70వ పేజీ చూడండి)




**కె. హైదరాబాదు**

ఆమెకు వివాహం అయింది. నేను మరిచి పోవాలనుకుంటున్నాను. కాని సాధ్యంకాదు. ఏం చేయమంటారు?

బాగుంది. 'విడువమంటే పాముకు కోపం, మింగమంటే కప్పకి కోపం' అన్నట్టు ఎటు చెప్పినా కష్టమే ... మీ అవస్థ ఏదో సినిమాలో సీనులాగా ఉంది ..... ఏ అనంత విశ్వంలోకో అలా అలా విషాదగీతం పాడుకుంటూనో, నేపథ్య గీతం వింటూనో నడక సాగించండి ప్రభూ!

**వి. వి ఎస్, కరీంనగర్**

కొందరి అమాయకత్వాన్ని చూసినప్పుడు గుండె జాలితోనిండి కన్నులద్వారా ప్రవహించుతుంది. దానివల్ల మనకిగాని ఎదుటి అతనికిగాని కలిగే దేమిటి?

ఎదుటి వాని కేమైనా కలిగినా కలగకపోయినా 'పాపం జాలి గుండెవాడు' అని పుష్కలంగా సానుభూతి దక్కుతుంది మీకు!

**పి. జె, కడప**

అన్నిటికంటే వాడియైన దేది? పదునైన దేది?

ఆడదాని చూపు. పరుషమైన మాట.

**డి. కె. కె, దేవరపల్లి**

అన్యాయ, మోసం, దౌర్జన్యం, లంచగొండితనం వరకట్న పిశాచం లేక మానవులు మానవులుగా ఉండే ప్రశాంత ప్రకృతి ప్రదేశం ఎక్కడేనాఉంటే కాస్త సెలవిద్దురూ!

అదెక్కడేనా తటస్థపడితే బాబ్బాబు — నాకూ చెప్పు. సకుటుంబంగా తరలి వస్తాను.

**కుమారి పి. వి. ఎల్, బరంపురం**

మానవుని కోరికలు ఎలా నెరవేరుతాయో తెలుపకలరా అక్కయ్యగారూ?

'కోరికలే గుర్రాలైతే ముష్టివాళ్ళు సహితం ఎక్కుతారు' అని సామెత. అవి తీరకపోవడమే బ్రతుకుసాగించడానికి నాంది చెల్లెలా.

**వి. వి, గుడ్లూరు**

నాకు కార్టూనులు గీసిపంపాలని ఆసక్తిగా ఉంది. అవి పెన్సిలుతో గీసి పంపాలా? యితర వస్తువులతో గీసి పంపాలా అని సందేహం.

ఇండియన్ ఇంకుతో దళసరి డ్రాయింగు కాగితం మీద వేసి పంపాలి. అప్పుడవి అచ్చులో బాగా వస్తాయి. ఇతరుల కార్టూనులు చూసి తీసి పంపకూడదని బహుశా మీకు తెలిసే ఉంటుంది.

**కె. వి. ఎస్. బి, కొత్తపల్లి**

డియర్ సిస్టర్, పెద్ద చదువులు చదివాను; కథలు, నవలలు వ్రాస్తున్నాను. పాటలు వ్రాయకలను, నటించకలను రేడియోలో వార్తలు చదవకల కంఠం ఉంది. నా కళారాధన అడుగునపడిపోయి నలిగిపోతోంది. ఎంత ప్రయత్నించినా పైకి రాలేక పోతున్నాను...

వెనకటికి సారన్ ఎప్పుడో వ్రాసింది— ఆంధ్ర యువతకి మూడేమూడు ధ్యేయాలని— 1. పత్రికలలో పేరు చూసుకోవడం. 2. సినిమాల్లో ముఖం కనిపించడం. 3. రేడియోలో గొంతు వినిపించడం. వీటికి అతీతులు కారు మీరుకూడా. మీరు మొదట ఆ 'సెల్ఫ్ పిటీ'కి స్వస్తి చెప్పండి. తరువాత పటిష్ఠమైన ప్రయత్నాలు చేయండి. ఎవరో మనని పైకి రానివ్వడంలేదు. అనుకోకూడదు. బ్రూసు సాలెపురుగూ కథ తెలియదా మీకు?!

**పి. బి. కె. ఆర్, ఒంగోలు**

మీకు కలలో మీ ఆరాధ్య దైవం కనబడి ఏదైనా వరం కోరుకోమంటే ఏమి కోరుకొంటారు?

సరిపోయింది! ఎడతెగని దెబ్బలాడితే కూడా కరగని ఆరాధ్య దైవం వాడి! కలలో నైనా తనకి తానై వరం కోరుకోమనడం అసంభవం సోదరా!

**వి. వి. ఎస్, కరీంనగర్**

చమత్కారంగా మాట్లాడడం కూడా ఒక కళే నంటారా?

తప్పకుండాను! సభారంజకత్వం తెలియని వాళ్ళ నలుగురిలో రాణించడం కష్టం.

**టి. పి. కె, ఆర్. ఎస్. పూర్**

ఎన్ని కథలు పంపినా తిరిగి వస్తున్నాయి. అది మా దురదృష్టం అనుకుంటున్నాం. చాలా నిరుత్సాహం కల్గుతోంది...

నడక నేర్చుకునే పసివాళ్ళు ఎన్నోసార్లు పడతారు. అంతమాత్రాన నడవడం మానేస్తున్నారా? కథలో వస్తైనా 'ప్రత' లోపం కలిగినంతమాత్రాన. రాస్తూ రాస్తూనే ఉండండి.

**డి. ఎస్. బి, మచిలీపట్నం**

స్నేహానికి బంధుత్వానికి ఏ మాత్రం సంబంధం ఉండదు, ఉండలేదు ఉండబోదు అని చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను ...

అతిగా పోకపోతే స్నేహాల్నా బంధుత్వాలూ కూడా నిలుస్తాయి.

**ఎస్, ఆర్, పి, ఎం, విజయవాడ**

స్త్రీ జీవితంలో ఎప్పుడు సంతృప్తి పొందుతుంది?

చదువుకునేటప్పుడు పరీక్ష పాసైతేను, కన్యకు కళ్యాణఘడియ వస్తేనూ, భార్యలకు మాతృత్వం సిద్ధిస్తేనూ, తల్లికి పిల్లల పెంపులోనూ, స్త్రీకి ఎప్పటికప్పుడు సంతృప్తి లభిస్తూనే ఉంటుందమ్మాయిలూ!

**ఎస్. పి. ఆర్, మెదక్**

మీ జవాబులు సున్నితమైన హాస్యంతో కూడుకొని అర్థపూరితములై చదువరులకు ముచ్చట కొల్పుచున్నవి...

థాంక్యూ.

**ఎ, జె. ఆర్, వాల్తేరు**

తిరిగి పంపడానికి తగినన్ని స్టాంపులు పంపినా కథలు పంపడానికి, కనీసం ప్రచురణార్హం అయినవో కానివో తెలిపేపాటి మర్యాద తెలియని సంపాదకులని ఏమనాలి?

సంపాదకుని కుర్చీలో ఓరోజు మిమ్మల్ని కూర్చోపెట్టాలి! రోజుకి కనీసం రెండు వీశెలకి పైగా సాహిత్యం సరఫరా చేస్తారు రచయితలు. ఏరోజు వచ్చినవి ఆరోజు చూడడానికి కూడా సమయం ఉండని సంపాదకుని పట్ల సానుభూతి ఎలా ప్రదర్శించాలో ఇట్టే నేర్చుకుంటారు.

**బి. ఎన్. ఆర్, అనకాపల్లి**

ప్రశ్నలకు సమాధానం యివ్వడమేనా; సమస్యలకు కూడా పరిష్కారం సూచిస్తుందా ఈ ప్రశ్నావళి?

చంపేశారు! ఎవరి సమస్యలతో వారే సతమతమై పరిష్కరించుకోవాలి. ఇక ఈ ప్రశ్నకి జవాబు అంటారా! నరుడాకే గాని సందేహాలు తీర్చాలని కాదు. అంత సర్వజ్ఞత్వం ఎవరి కుంటుంది?

**కె.ఆర్.ఎల్.ఆర్, గంగలమర్తి అగ్రహారం**

ఏమండీ భాషా సమస్యపై మీ ఉద్దేశ్యం ఏమిటి?

భాషలు నేర్చుకుందుకు అభిరుచి కావాలి. దానిని ఎవరూ శాసించి పెంపొందించలేరు.




గురు శుశ్రూష చేసి, కోరిన విద్యలు నేర్చుకున్న తర్వాత తగిన గురుదక్షిణ యిచ్చి ఆచార్యుని సత్కరించిన శిష్యుడు ఉత్తముడని పెద్దలు చెప్తారు. తనకు విద్యలు నేర్చుకునే అవసరం లేకపోయినా గురుకులవాసం చేసి, ఎవ్వరికీ సాధ్యంకాని ఘన కార్యాన్ని నెరవేర్చి గురువుగారికి అంతు లేని సంతోషాన్ని కలిగించిన శిష్యులు కోటి కొక్కరయినా ఉంటారో లేదో! అట్టి శిష్యుడిని మించిన ఆదర్శ శిష్యుడు ఎవ్వ డుంటాడు ?

ఆదర్శ శిష్యుడు మాదిరిగానే ఆదర్శ గురువూ ఎంతో అరుదుగా ఉంటాడు! ఛాత్రుణ్ణి అత్యంతాభిమానంతో చూస్తూ కోరిన విద్యలను బోధించి, అతని శ్రేయస్సు కోరేవాడు ఉత్తమ గురువు. ఏమి చెయ్య డానికీ పాలుపోని సందిగ్ధావస్థలో ఉండి, దారీ తెన్నూ తెలియని శిష్యుడికి తగిన కర్తవ్యాన్ని బోధించి, దారికి తెచ్చి మనస్సుకు ప్రశాంతిని కలిగించేవాడు ఆదర్శ గురువు.

ఇట్టి శిష్యత్వమూ, గురుత్వమూ కూడా ఒకే వ్యక్తిలో కానరావడం మిక్కిలి అరుదు. ఈ రెండు ఉత్తమోత్తమ ధర్మాలూ భగవానుడు శ్రీ కృష్ణుని యందే కాన వస్తాయి.

శ్రీ కృష్ణుడు జన్మించినదాది అద్భుతా లైన విలాసాలు చూపేవాడని అందరికీ తెలుసును. అతనికి పుట్టుకతోనే సమస్త విద్యలూ వచ్చును. గురు ముఖతః నేర్చుకో వలసినదేమీ లేదు. అయినా—ఎంత ప్రతిభా శాలి అయినా గురుకులవాసం చేసి, విద్య నేర్చుకోవాలనే భారతీయ సంప్రదాయాన్ని అనుసరించి, అన్నయిన బలరామునితో కూడా కాశీకి వెళ్ళి, సాందీపని అనే గొప్ప విద్వాంసుడివద్ద విద్యలు నేర్చుకున్నాడు— అరవైనాలుగు విద్యలనూ అరవైనాలుగు రోజుల్లోనే సమగ్రంగా గ్రహించిన వీరి ప్రతిభ గురువును చకితుణ్ణి చేసింది.

శ్రీ కృష్ణుడు భగవదవతారమూర్తి అనీ, ఆతడు సాధించలేని పని యేదీ వుండదనీ సాందీపని గ్రహించాడు. ఎన్నోయేళ్లకిందట సముద్రంలో పడిపోయిన తన కుమారుణ్ణి శ్రీ కృష్ణుని మూలంగా తెప్పించాలని ఆయన సంకల్పించాడు. సాందీపని బలరామ, కృష్ణుల ప్రతిభను కొనియాడుతూ—పూర్వం—ప్రభాసతీర్థంలో సముద్రస్నానం చేస్తూ, అలల్లో కొట్టుకొనిపోయిన తన కుమారుణ్ణి గురుదక్షిణగా ఈయవలెనని కోరాడు—కోరడమేమిటి? ప్రాధేయపడ్డాడు!

ఎంత అసాధ్యపు పని అయినా సరే, గురువుగారి కోరికను నెరవేర్చవలసినదే అందుకని శ్రీ కృష్ణుడు అన్నతో కూడా సముద్రతీరానికి వెళ్ళి 'ఓ సముద్రుడా! కొన్నేళ్ళక్రితం నీలో స్నానానికి వచ్చిన మా గురుపుత్రుణ్ణి అప్పగించు; లేకపోతే నీగతి యేమౌతుందో చూసుకో!' అన్నాడు కృష్ణుడు. సముద్రుడు భయపడి, 'పంచ జను'డనే రాక్షసుడు ఆ బాలుణ్ణి మింగి వేశా'డంటూ, వాడున్నచోటు చూపించాడు. భగవానుడు ఆ రాక్షసుణ్ణి చంపి, తర్వాత యమలోకానికివెళ్ళి, యముణ్ణి బెదరించగా, అతను ఆ బాలుణ్ణి అప్పగించాడు! ఆ బాలుణ్ణి గురువుగారికి అప్పగించి కృష్ణ భగవానుడు తాను కృతార్థుడనైనట్లు భావించాడు.

శ్రీ కృష్ణునివంటి శిష్యుడు 'నభూతో—నభవిష్యతి' అని సాందీపని మిక్కిలి ప్రశం సించాడు.




కృష్ణభగవానుడు ఆదర్శగురుడని అందరికీ తెలుసు!

భారతయుద్ధం యిక ప్రారంభమవుతుం దనగా—అర్జునుడు తన పక్షీయులనూ! కౌరవపక్షీయులనూ చూస్తూ, ఏమీ తోచక నిలబడిపోయాడు. రెండు పక్షాల్లో ఉన్న వారూ తన బంధుమిత్రులే కాని పైవారు కారు. తాను యుద్ధం చెయ్యలేననే ఆతడు శ్రీ కృష్ణభగవానుడితో చెప్పాడు.

అట్టి స్థితిలో భగవానుడు అర్జునుడి మనస్సులో నాటుకొనివున్న అవిద్యాబీజాల్ని తీసివేసి, అజ్ఞానాన్ని నశింపజేశాడు. కీర్తి ప్రతిష్ఠలు నిలుపుకోడానికి స్వధర్మాన్ని నిర్వహించాలనీ, క్షత్రధర్మమైన యుద్ధానికి ఎంతమాత్రం వెనుక తియ్యవద్దని హెచ్చ రించి గీతోపదేశం చేశాడు.

భగవానుడు అర్జునుడికి గీతోపదేశం చెయ్యడం మూలంగా మానవలోకం అంతటికీ మహోపదేశంచేసి, ముక్తి మార్గాన్ని చూపాడు. అర్జునుడికే కాకుండా యావ న్మానవులకూ మహోపదేశం చేసిన కృష్ణ భగవానుడి కంటె ఆదర్శగురువు మరెవ రున్నారు? ●

# కుటుంబ నియంత్రణా ఉద్యమం వనితల పాత్ర

**మొదటి బహుమతి**

........మామిడి అనంతలక్ష్మి.....

[కుటుంబ నియంత్రణ సమస్యలమీద మేము నడిపిన 'వనితాలోకం వ్యాసరచన పోటీ' ఫలితాలు ఈ కింద ప్రచురిస్తున్నాము.

మొదటి మూడు బహుమతులు పొందిన వ్యాసాలు ఈవారం ప్రచురిస్తున్నాము. మిగిలినవి వీలువెంబడి తర్వాతి సంచికలలో వెయ్యదలిచాము. ఏనిమిది 'బహుమతి వ్యాసాలే' కాక మరి మూడు 'ప్రత్యేక వ్యాసాలు' కూడా పాఠకులకి అందచెయ్యదలిచాము.

ఇవన్నీ కుటుంబనియంత్రణ సమస్యల పరిష్కారానికి ఎంతో కొంత తోడ్పడగలవని ఆశిస్తున్నాము. ఈ పోటీ నిర్వహణవల్ల కూడా కొంత మేలు ఏర్పడి ఉండవచ్చునని భావిస్తున్నాము!

*పోటీలో పాల్గొని దానిని విజయవంతం చేసిన రచయిత్రులందరికీ* **మా కృతజ్ఞతలు!**

—సం॥]

**మొదటి బహుమతి రు. 200**
శ్రీమతి మామిడి అనంతలక్ష్మి, హైదరాబాదు.
**రెండవ బహుమతి రు. 150**
శ్రీమతి చెరుకుపల్లి రాజమ్మ, గోరుమానికొండ.
**మూడవ బహుమతి రు. 100**
శ్రీమతి ఎస్. రమామణి, గార
**కన్సొలేషన్ బహుమతులు రు. 50 చొప్పున**
కుమారి ఎన్. కమల, కర్నూలు.
శ్రీమతి ఉమా వెంకట్రామన్, బొంబాయి.
శ్రీమతి ఎం. కమలాదేవి, ధన్‌బాద్.
డాక్టర్ డి. జ్యోత్స్నకుమారి, కర్నూలు.
శ్రీమతి ఈశ్వరిగారి ముక్తేశ్వరీ నరహరిశర్మ, వేములవాడ.
**ప్రత్యేకంగా ఎన్నుకున్న వ్యాసాలు**
శ్రీమతి ఎస్. సరళ, బొంబాయి. శ్రీమతి యర్రమల్లి సుశీల, తిలారు.
శ్రీమతి డి. అన్నమ్మ, దొడ్డవరం.

దేశంలో విపరీతంగా పెరిగిపోతున్న జనాభా సమస్యను పరిష్కరించడానికై ప్రభుత్వం కుటుంబ నియంత్రణ ఉద్యమాన్ని ప్రారంభించి, అనేక పథకాలను, కార్యక్రమాలను అమలు జరుపుతున్నది.

దేశం మొత్తంమీద ఇప్పుడు సుమారు 5,000 కుటుంబ నియంత్రణ కేంద్రాలు పనిచేస్తున్నాయి. అనేక ఆసుపత్రులలో సమాచారం, సలహాలు అందజేసే ఏర్పాట్లు ఉన్నాయి. సుమారు 10,000 మంది శిక్షితులైన స్త్రీ పురుష ఉద్యోగులు ఈ కార్యక్రమాల అమలులో నిమగ్నులై ఉన్నారు. ఇంతే కాకుండా పత్రికలద్వారా, రేడియోద్వారా, సినిమాలద్వారా కూడా కుటుంబ నియంత్రణ ప్రచారం జరుగుతున్నది. వీటన్నిటికోసం ప్రభుత్వం కోట్లాది రూపాయలు వ్యయం చేస్తున్నది అయినప్పటికీ ఆశించిన ఫలితాలు లభించడంలేదు.

దీనికి కారణమేమిటి?

ఈ వైఫల్యానికి ఏ ఒక్కరినో తప్పు పట్టడం భావ్యంకాదు. ప్రభుత్వం, ప్రచారకులు, మన కుటుంబాలలోని స్త్రీ పురుషులు అందరూ దీనికి బాధ్యులే.

మనదేశం అతి విశాలమైనది. మన జనాభా 50 కోట్లు దాటిందని అంచనా వేస్తున్నారు. ఇంత పెద్దదేశానికి ఐదువేల కుటుంబ నియంత్రణ కేంద్రాలు, పదివేల మంది సిబ్బంది సరిపోరు. దేశప్రజలలో నూటికి 82 మంది గ్రామాలలో నివసిస్తున్నారు. గ్రామాలలో విద్యావంతులు, దేశ సమస్యలను అర్థం చేసుకోగలవారు చాలా తక్కువ. కుటుంబ నియంత్రణ కేంద్రా

లలో అత్యధికభాగము పట్టణాలలోనే వున్నాయి. ఐదువేల కేంద్రాలలో గ్రామాలలో ఉన్నవి ఐదారువందలే. వీటిలో కూడ సమాచారం పూర్తిగా లభించే ఏర్పాట్లు లేవు. సాధన సామగ్రి కొరత ఉండనే వుంది. జనాల సంఖ్య గ్రామీణ ప్రాంతాలలోనే అధికంగా ఉండడం దృష్ట్యా గ్రామాలలో కుటుంబ నియంత్రణ కేంద్రాల సంఖ్యను పెంచడం గ్రామీణులకు అర్థమయ్యే భాషలో సమాచారాన్ని అందించగల సిబ్బందిని నియమించడం, ఈ కేంద్రాలకు అవసరమైన సాధనసామగ్రి నంతటినీ సరఫరా చేయడం అవసరం.

రేడియోద్వారాను, ఇతర విధానాలుగాను ప్రభుత్వం జరుపుతున్న ప్రచారం చాలా వరకు మొరటుగాను, అసభ్యకరంగాను ఉంటున్నది. కుటుంబ నియంత్రణ అవసరమని భావించే వారికికూడా ఇది అసహ్యం కలిగిస్తున్నది. ప్రచారంలో అశ్లీలాలు దొరలకుండా జాగ్రత్త వహించడం చాలా అవసరం.

ప్రచార పద్ధతిలో కూడా మార్పు రావలసిన అవసరమున్నది. దేశంకోసం త్యాగం చేసి, కుటుంబ నియంత్రణను అమలు జరుపాలని చెప్పడం అనవసరం. జనాభా సమస్య ఉత్తర సరిహద్దుల్లో చైనాతో జరుగుతున్న యుద్ధంవంటిది కాదు. ఇది ప్రతి కుటుంబానికి సంబంధించిన సమస్య. కుటుంబ సమగ్రాభివృద్ధికి అంతరాయం కల్పిస్తున్న సమస్య. కుటుంబ నియంత్రణను అమలు జరుపడమంటే దేశంకోసం ఏదో త్యాగం చేయడం కాక ఎవరి సౌఖ్యం కోసం, అభివృద్ధికోసం వారు ప్రయత్నించడమే. ప్రభుత్వ ప్రచారం ఈ విషయాన్ని బాగా వివరించి చెప్పేదిగా వుండాలి. లేకపోతే త్యాగాలకు విలువలేకుండా పోతున్న ఈ రోజుల్లో ఎవరూ ఈ ప్రచారానికి విలువనివ్వరు.

ప్రభుత్వ సిబ్బంది ఏదో జీతం రాళ్ళ కోసం పనిచేస్తున్న అనాసక్తవాదులవలె గాక, ఒక ఉద్యమానికి అంకితమైన కార్యకర్తలుగా పనిచేసేటట్లు చూడడం మరొక అవసరం.

కుటుంబ నియంత్రణ విధానాలు, సాధనాల గురించి కూడా కొన్ని మాటలు చెప్పడం అవసరం. ప్రభుత్వం ప్రచారం చేస్తున్న విధానాలు, సిఫార్సు చేస్తున్న సాధనాలు అన్నీ విదేశీయమైనవే. వీటిలో చాలా భాగం, చాలావరకు మన దేశకాల పరిస్థితులకు తగినవి కావు. స్వదేశీ సాధన విధానాలు రూపొందించడానికి ప్రభుత్వం ఇకనైనా ప్రయత్నించడం అవసరం. అప్పుడే ఈ సాధనాలపట్ల ప్రజలకు విశ్వాసం పెరుగుతుంది. విధానాలు సులభమైనవిగాను, చదువు సంధ్యలు లేని సాధారణ గ్రామీణులకు కూడా అర్థమయ్యేవిగాను, ఆచరణయోగ్యమైనవిగాను వుండాలి. మారుమూల గ్రామాలలోని వారికి కూడా అందుబాటులో వుండాలి. నిరుపేదవారు కూడా సేకరించుకోవడానికి వీలుగా వుండాలి. అన్నిటికంటే ముఖ్యం ఈ సాధనాల ఉపయోగం వల్ల దుష్పరిణామాలు కలుగకుండా వుండటం. ఒకరి అనుభవం ప్రభావం వారి ఇరుగు పొరుగు వారిపైనే గాక, దూర ప్రాంతాలలో వుండే బంధు మిత్రులపై కూడా పడుతుందనేది గమనించాలి.

ప్రస్తుతం ధనిక కుటుంబాలవారే అధికంగా కుటుంబ నియంత్రణను అమలు జరుపుతున్నారు. పేదవారు ఎక్కువగా అమలు జరుపనంతకాలం ఈ ఉద్యమం జయప్రదం కాదు. ఏటా ఎంతమంది ఈ ఉద్యమంలో పాల్గొంటున్నారనేది కాక, ఏయే వర్గాలవారు పాల్గొంటున్నారనేది ముఖ్యం.

వీటన్నిటికంటే ముఖ్యమైన అవరోధాలు, సమస్యలు మరికొన్ని ఉన్నాయి. వాటి పరిష్కారానికి పూనుకోవడం తక్షణావసరం.

కుటుంబ నియంత్రణను కొన్ని మతాల వారు వ్యతిరేకిస్తున్నారు. వారిచేత అంగీకరింప జేయడానికి ప్రయత్నాలు అవసరం.

సంతానం ఈశ్వరేచ్ఛపై ఆధారపడిన విషయమని కొందరి నమ్మకం. ఈశ్వరుని అస్తిత్వాన్ని కాదనడం అవసరంలేదు. కాని, రోగాలు, నొప్పులకు మందు మాకులు చేయించుకున్నట్లే, ఆర్థిక ఇబ్బందులకు, శారీరిక రుగ్మతలకూ కారణమవుతున్న అతి సంతానానికి అడ్డుకట్టవేయడం అవసరమని వారికి నచ్చచెప్పడం అవసరం.

వాసెక్టమీ, స్టెరిలైజేషన్‌లు కూడా కొన్ని సమస్యలను తెచ్చి పెడుతున్నాయి. వాసెక్టమీ ఆపరేషన్‌లు ఫెయిల్ అయిన కొన్ని సందర్భాలలో స్త్రీల సంసార జీవనం దుర్భరమై పోతున్నది. ఈ పరిస్థితిలో ఆత్మహత్య చేసుకున్న ఒక సోదరి కథకూడా నాకు తెలుసు.

భర్తలందరూ ఒకే విధంగా వుండరు. స్టెరిలైజేషన్ చేయిస్తే స్త్రీలకు సంతానం కలుగుతుందనే భయం పోయి విచ్చలవిడిగా ప్రవర్తిస్తారనే అనుమానంగల పెద్ద మనుషులూ కొందరున్నారు. ఈ సమస్యకు పరిష్కార మార్గమేమిటో భగవంతుడికే తెలియాలి. (స్టెరిలైజేషన్‌కు అనుమతినివ్వక, వాసెక్టమీకి ఇష్టపడని భర్తల సంగతే నేను చెప్పేది.)

ఇక వనితాలోకం పాత్ర గురించి చర్చించుదాం.

కుటుంబ పోషణా భారం పురుషులదే అయినప్పటికీ, పిల్లలను కని పెంచే భారం స్త్రీలదే కదా! పిల్లల విషయంలో ఎక్కువ బాధ్యత, బరువు తల్లిమీదనే పడుతుంది. మధ్య తరగతి కుటుంబాలలో ఇది మరీ ఎక్కువ. అందువల్ల కుటుంబ నియంత్రణ పట్ల పురుషులకంటే స్త్రీలకే ఎక్కువ శ్రద్ధాసక్తులు వుండాలి. విద్యావతులైన స్త్రీలు మంచి డాక్టర్లు వ్రాసిన పుస్తకాలు చదవడం, ద్వారాను, కుటుంబ నియంత్రణ కేంద్రాల ద్వారాను అవసరమైన సమాచారాన్ని తెలుసుకొని, తాము ఆచరించడమే గాక ఇతర సోదరీమణులకు వివరించాలి.

తాము ఆచరించే విధానాలు ఏ కారణం వల్లనైనా విఫలమైనా, లేదా వాటివల్ల ఏవైనా దుష్పరిణామాలు సంభవించినా, వాటికి కారణమేమిటో తెలుసుకోకుండా వాటినిగురించి దుష్ప్రచారం చేయరాదు. అనేక దుష్పరిణామాలకు కారణం అపరిశుభ్రత అనే విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి.

పిల్లలు లేనివారిని అపహాస్యం చేయడం మన సోదరీమణులు చాలామందికి సరదా. ఈ పిచ్చిపనివల్ల ఎదుటివారి మనసు ఎంత గాయపడుతుందో చెప్పలేము. ఎక్కువమంది పిల్లలుండడం ఏదో ఘనతకు చిహ్నంగా భావించుకునే మనస్తత్వం విడనాడాలి.

కుటుంబ నియంత్రణను వ్యతిరేకించే మగ మహారాజులకు నచ్చచెప్పుకోవడం కూడా స్త్రీల బాధ్యతలలో ఒకటి.

మన వనితాలోకం ఈ మాత్రం చేయగలిగినా ఈ ఉద్యమం చాలావరకు సఫలమవుతుంది. ●




భారతదేశంలో ఒకవైపు రాజకీయ అస్థిరత. మరొకవైపు పాకిస్థాన్ చైనాల ఆక్రమణలు, యింకొకవైపు ఆర్థిక మాంద్యం మరొకవైపు ఆహారకొరత వేతన విషయాలలో ఉద్యోగుల అసంతృప్తి, భాషల తగాదా యిలా చెప్పుకుపోతూంటే నేడో రేపో భారతదేశం ఏమికానున్నది అన్న ఆందోళన కలుగక మానదు ప్రతి భారతీయునికి. ఇవన్నీ ఆందోళన పరిచేవైతే పూర్తిగా భయపెట్టేది జనాభా సమస్య.

పెరుగుతున్న జనాభాను గత యిరవై యేళ్ళనుండీ గమనిస్తూనే ఉన్నా అంకెల్లో, విషయసేకరణలో, పరిపాలనా వ్యవహారంలో మాత్రమే యోచించడం జరిగిందిన్నినాళ్ళూను. ఇప్పుడైతే అలాకాదు. నాయకులు మొదలు సామాన్య పౌరుడివరకు యీ జనాభా సమస్యపై అందరిదృష్టి మళ్ళింది. దీని నెలా పరిష్కరించాలి? అన్నదే ప్రస్తుత జీవన్మరణ సమస్య. ప్రస్తుతం సుమారు 50 కోట్ల జనసంఖ్యగల భారతదేశంలో ఆహారకొరత, నిరుద్యోగ సమస్య, ఆర్థిక మాంద్యం, ధరల పెరుగుదల యింతటి విలయతాండవం చేస్తుంటే ప్రతిసంవత్సరానికీ దాదాపు కోటి పైచిలుకు పెరిగే జనాభాకు నిత్యావసరాలు యెక్కడినుండి రాగలవు? ఇంకో వంద సంవత్సరాలకు ప్రపంచంలోని భూభాగంలో ఒకరికి కొన్ని చదరపు గజాలు మాత్రమే రాగలవని ప్రపంచ జనాభా నిపుణులు అభిప్రాయపడ్డారు. కనుక ఈ సమస్యను దీర్ఘకాలిక ప్రక్రియగా నేడే పరిష్కార మార్గానికి పునాదులు వేయక తప్పదు.

భారతప్రభుత్వం యిందుకు అనేక మార్గాలను అన్వేషిస్తున్నది. ముగ్గురికంటె ఎక్కువ సంతానం ఉండరాదన్న అభిప్రాయం ఒకటి. స్టెరిలైజేషన్, గర్భస్రావచట్టం సడలింపు, సంతాన నిరోధానికి దోహదం చేసినవారికి బహుమతు లివ్వడం. ఒకటి నిర్బంధం, రెండోది ప్రోత్సాహం. మొదటిదానిలో కేంద్రం యీ మధ్యనే ఒక ఉత్తర్వుకూడా జారీచేసింది — తన ఉద్యోగులకొరకై, 'నాలుగో కాన్పుకు కాన్పు సెలవు మంజూరు చేయబడదు' అని. అయితే దేశంలో యెంతమంది కేంద్ర ఉద్యోగులున్నారు? వారిలో స్త్రీల శాతమెంత? వారికే పరిమితమైన ఈ ఉత్తర్వు వలన యెంతటి ఫలితం రాగలదు. కేవలం సెలవు నిబంధనకు కట్టుబడి, ఆశపడి యెంతమంది కుటుంబ నియంత్రణను పాటించగలరు? ఇవన్నీ ఆలోచించవలసిన అంశాలు ఇక రెండో పద్ధతి ప్రోత్సాహం. సంతాన నిరోధానికి దేశవాళీ మందులను కనిపెట్టినవారికి లక్షరూపాయలు బహుమతి యివ్వడం. స్టెరిలైజేషన్ చేయించుకున్నవారికీ, లూపులూ, ఆపరేషన్లూ చేయించుకున్నవారికీ, అట్టిపనికి దోహదం చేసినవారికీ బహుమానాలు యివ్వడం. ఒక విధంగా మొదటిదానికంటే రెండోది కొంతవరకు నయం. కాని యింకా ఆలోచిస్తే ఈ రెండు పద్ధతులూ అంత క్రమమైనవి కావు. ఎందుకంటే ఒకటి నిర్బంధమూ, మరొకటి లంచమూను.

ఒక విషయాన్ని యిక్కడ జ్ఞాపకం చేసుకోవాలి. జనాభా సమస్యా, దాని విష త్పాదక బాధకాలూ మన భారతదేశంలో యెంతమందికి తెలుసు? పల్లెసీమల మయమైన భారతదేశంలో రేడియోలూ, వార్తాపత్రికలూ, ఆసుపత్రులూ యీ పల్లెవాసులకు యెంతవరకు అందుబాటులో ఉన్నాయి. వీరిని నిర్బంధం చెయ్యాలంటె అది ప్రజాస్వామ్యానికే దెబ్బ. ప్రస్తుతమున్న సమస్యలకు తోడు మత, సాంఘిక శక్తులు విజృంభించగలవు. దీన్ని శాసనం చేస్తే ముందుగా మహమ్మదీయులు, తర్వాత క్రైస్తవులు తమ అసంతృప్తిని ప్రకటిస్తారు. ఈ రెండు మతాలకూ ఇది దైవ విరోధకార్యం. ఇదిలా వుండగా హిందువుల వాదమూ ఒకటుంది. పై రెండు తెగలకు మినహాయించి హిందువులకే దీనిని చట్టం చేస్తే లేక హిందువులకూ క్రైస్తవులకూ దీనిని చట్టంచేస్తే అల్పసంఖ్యాకులైన క్రైస్తవులు నాశమౌతారు. అదెట్టి సమస్యగానీ అదెంత అల్పవర్గ సమస్యగాని దానిలో తమ వాదానికి తమ బలమునేది ఉంటేచాలు. నేటి రాజకీయ పార్టీలన్నీ గాలిదుమారం రేపేందుకు వెనుకాడవు. ఇదిలా ఉండగా హిందువులలో అనేక పీఠాధిపతుల వాదం మరొకటుంది. మహమ్మదీయులను మినహాయించి హిందువులకే ఈ సంతాన నిరోధాన్ని రుద్దితే ఒక శతాబ్దంనాటికి మహమ్మదీయుల సంఖ్య పెరిగిపోయి హిందువుల సంఖ్య తరిగిపోతుంది. భారతదేశ గత చరిత్రను పునశ్చరణ చేసుకుంటే ఎన్ని జరగలేదు. హిందువుల తర్వాత మహమ్మదీయులు, వారితర్వాత ఆంగ్లేయులు ఏలిన ఈ గడ్డపై ఇరవై

యేండ్ల క్రిందటనే మన అవిచ్ఛిన్న భారతదేశంలో సంఖ్యా బలంతో భాగాన్ని పంచుకున్నారు మహమ్మదీయులు. ఇక ముందు ముందు భాషా రాష్ట్రాలూ, మతరాష్ట్రాలూ ఇలా ఉత్పన్నమై చివరికి అధిక సంఖ్యాకులైన మహమ్మదీయులే భారతాన్ని ఆక్రమించుకోవచ్చు. ఇది పీఠాధిపతుల ఊహ జనాభా సమస్యలో మన ఊహలు యెంత ఖచ్చితమైనవీ సమంజసమైనవో యీ వాదంలో కూడా అంత నిజముంది ఇంకో విషయమేమంటే మహమ్మదీయులకు బహుభార్యాత్వం మత సమ్మతం, చట్ట సమ్మతం

ఇన్ని ఆలోచించిన మీదట ఇక రెండో పద్ధతే మెరుగులా తోస్తుంది అట్టి దానిని అనుసరిస్తూనే ప్రభుత్వం ఉచిత ఆపరేషన్లూ స్టెరిలైజేషన్లూ బహుమతుల వగైరా జరుగుతున్నాయి. ఇది మొదటిదానికంటె మెరుగైన దనడంలో అంతకంటే మంచిపద్ధతి మరి లేదని అనుకోరాదు అదేదో దానినే ప్రభుత్వం అనుసరించాలి. ఏ పనికైనా అవగాహన (విషయగ్రహణము), ప్రోత్సాహము అవసరము. అటుమీదే నిర్బంధము. చివరి పద్ధతి అవసరం కారాదు.

భారతదేశం పల్లెల దేశమైనంత మాత్రాన అమాయకమూ అజ్ఞానమూ ఆ పల్లెల్లో బాజా పట్టిందని భావన చేయరాదు. గత యెన్నికలను గుర్తు చేసుకుంటే ఈ విషయం తెలియగలదు. అయితే వారి భావాలను ప్రేరేపించాలి. ఎన్నికలు గత యిరవై యేళ్ళుగా ఏదో ఒక రూపేణా జన సామాన్యానికి అనుభవమైన విషయం. ఈ కుటుంబ నియంత్రణమట్టిది కాకపోవచ్చు. అయినా చెపితే గ్రహించే నేర్పూ ఓర్పూ లేక పోలేదు. గ్రామజీవుల భావాలు ఎంత స్థూలమైనవో అంత నిశ్చలమైనవి కూడా. ఎన్నికలకు యెట్టి ప్రచారం జరిగిందో అది దేశ సమస్య యెలాగో యిదీ అట్టిదేనని వారిని ఒప్పించాలి అంతటి ప్రచారము దీనికి జరగాలి ఇదెలా సాధ్యమనుకోకూడదు. కొన్ని చోట్ల జిల్లా కేంద్రాలకూ, కొన్నిచోట్ల తాలూకాలకు పరిమితమైన కుటుంబ నియంత్రణ కేంద్రాలను పెద్దపెద్ద గ్రామాలకు (పంచాయతీ గ్రామాలకు) విస్తృతం చేయాలి. మిడ్‌వైఫ్, మలేరియా విజటర్స్, విలేజి లెవెల్ వర్కర్సు వలె ఈ కుటుంబ నియంత్రణ కేంద్రాలనీ, ట్రైనింగు సెంటర్లనీ, స్వచ్ఛంద సేవకులనీ నెలకొల్పాలి. కొన్ని ప్రభుత్వ ఉత్సవాలూ సర్వదినాలకు వలె ఈ కుటుంబ నియంత్రణ గురించి తరచుగా సభలూ, ప్రచారమూ జరగాలి. కరపత్రాలు పంచిపెట్టాలి. దేశజనాభా సమస్య, కుటుంబ నియంత్రణ, స్టెరిలైజేషను మొదలగు విషయాలని ప్రజలకు క్షుణ్ణంగా వివరించాలి ఈ సమస్యలపై ప్రజల వివేకాన్ని మేలుకొలపాలి. ముఖ్యంగా స్త్రీలలో ఈ ప్రచారం యెక్కువగా జరగాలి అందుకు మహిళా సేవికలే యెక్కువ ఉపయోగపడగలరు ప్రభుత్వమూ, స్థానిక స్వపరిపాలనాసంస్థలు కొన్ని పత్రికలను ఈ కుటుంబ నియంత్రణ ప్రతిపాదికగా ప్రచురించాలి. ఒక్కొక్క పంచాయతీకి దాని సామర్థ్యమును బట్టి కొన్ని ప్రతికలను ఉచితంగా గాని స్వల్పధరకుగానీ కేటాయించాలి. సాధ్యమైతే కుటుంబానికి ఒక ప్రతికవంతున పంచేటట్టు చూడాలి. మొత్తముపై విద్య, ఎన్నికలు, పన్నులు, ఆసుపత్రులు, రోడ్లు, బావులు యెంత అవసరమో యీ కుటుంబ నియంత్రణ కూడా అంత అవసరమే నన్న అవగాహన పల్లెల్లో పట్టణాల్లో పామరులలో అందరిలోనూ కలగాలి. ప్రతి తాలూకా ఆసుపత్రికి అనుబంధంగా కుటుంబ నియంత్రణయందు సుశిక్షితులైన సిబ్బందిని ఉంచాలి. ఆసుపత్రికి వచ్చే ప్రతి రోగికీ ప్రతి బంధువుకూ కుటుంబ నియంత్రణను గురించి వారు వివరించాలి. తాలూకా స్థాయిలోగాని జిల్లా స్థాయిలో గాని టూరింగ్ ఫామిలీ ప్లానింగు సిబ్బంది ఉండాలి. వారు జిల్లా లేక తాలూకా పర్యటిస్తూ, కొన్ని ప్రత్యేక కార్యక్రమాలను, మేళలను చేపట్టాలి. ఇక్కడ ఒకటి మరువకూడదు. ఏదైనా బాధ్యతతో పనిచేస్తేనే యీ పని జరుగగలదు.

అవగాహనకు అన్ని సదుపాయాలు జరిగిన మీదట ప్రోత్సాహం యెంతైనా అవసరం. ప్రస్తుతం ప్రభుత్వం అనుసరిస్తున్న పద్ధతులు యిప్పట్టుననే యోగ్యమైనవి కాగలవు. లూప్‌లు, ఆపరేషన్లూ ఇలా అనుకూలాల్ని బట్టి చేయించుకున్నవారికీ, చేసినవారికీ, అట్టి పనికి ప్రోత్సహించినవారికీ ప్రోత్సాహమూ, ప్రమోషన్లూ, నగదు బహుమతులూ ప్రశంసా పత్రాలూ యివ్వవచ్చు. ఒక పరిధిలో అవగాహనమూ, ప్రోత్సాహమూ కలిగించినమీదట ఆ తర్వాత చట్టము దానంతట అదే అవుతుంది. అప్పుడు చట్టాన్ని ఆక్షేపించేవాళ్ళూ, దుయ్యబట్టే వాళ్ళూ తమ రాజకీయ ప్రయోజనాలకు ఈ కుటుంబ నియంత్రణ సమస్యను వాడుకునేవాళ్ళూ ఉండరని భావించవచ్చు.

ప్రభుత్వమూ కుటుంబనియంత్రణ సంస్థలు ఒకవైపు తమ పనిని బాధ్యతాయుతంగా చేసుకుపోతుంటే మరి సామాన్య ప్రజలూ, ముఖ్యంగా వనితల పాత్ర ఏమిటి ఇందులో? దేశంలో నేడు ప్రతి చిన్న విషయానికీ ప్రభుత్వ ఖజానాను, ప్రజల పన్నులను తినివేసేశాఖలూ సిబ్బందీ దండిగా వుంది. వారిది ఉద్యోగనిర్వహణ అయితే మనది వివేక నిర్వహణమై వుండాలి. పురుషులు తమ స్త్రీల ఆరోగ్యాన్నీ క్షేమాన్నీ కోరాలి. ఇప్పుడు భర్త తన భార్యను అనాదరణ చేస్తున్నాడనికాదు. దేహపటుత్వంలో అల్పురాలైన తన భార్య కాన్పు కాన్పుకి యెంత నిస్సత్తువ, ఎంత బుగ్మత, ఎంత వికారత ప్రోగుచేసుకుంటుందో, నెలలతో ఉన్నప్పుడు నిమ్మలూ, బాలింతైనప్పుడు పత్యాలూ, యిలా తన స్త్రీ యెంత యాతన పడుతుందో అవగాహన చేసుకోవాలి. ఇంకో విషయం. తాను ఆర్జించిన ఆస్తి పుష్పక విమానమా ? ఆ ఆస్తి యేపాటిది ? ఇంకో నలుగురైదుగురు సంతానమైతే తానేమివ్వాలి వారికి ? ఇవన్నీ సహజ లజ్జితయైన తన భార్యనోట వినలేడు. తానే యివన్నీయోచించి గర్భనిరోధానికి తన భార్యను ప్రోత్సహించాలి.

ప్రతి మహిళకూడా యిలా ఆలోచించాలి. 'నాగర్భాన పదినెలలుమోసి నానెత్తురునూ, ఆరోగ్యాన్నీ వమ్ముచేసి జీవన్మరణ ప్రయాసాన్ని సహించి కన్న నా సంతానానికి నిత్యావసరాలు రేపు కూర్చగలనా ? నా గర్భ జనితుడైనంత మాత్రాన ఆ సంతానం రేపు దరిద్రుడూ నికష్టుడూ ఎందుకు కావాలి ? జన్మనిచ్చిన నేను తక్కినవి యివ్వకపోతే యెలా ?'

ప్రభుత్వమూ ప్రజలూ మహిళలూ పూర్తిగా సహకరిస్తేనేగాని జ్ఞానాజ్ఞాన మిశ్రితమైన మనదేశం బాగుపడదు. కుటుంబ నియంత్రణ అప్పుడే చట్టంగా కాక 'అవసరం'గా జరుపబడుతుంది సర్వత్రా. ●

ప్రపంచంలో దాదాపు అన్ని పెద్ద దేశాలను యీనాడు వేధిస్తున్న సమస్య 'జనాభా పెరుగుదల' అనే విషయాన్ని అనునిత్యం పత్రికల్లో చూస్తున్నాం. ఈ సమస్య మన దేశంలో మరింత తీవ్రరూపం దాల్చటం మన దురదృష్టం. జనాభా సమస్య పరిష్కారానికి ప్రభుత్వం అనేక పథకాలను తలపెట్టింది. కోటానుకోట్ల రూపాయిలను ప్రత్యేకిస్తున్నది. అనుకున్న మేరకు ఫలితాలు కనిపించకపోయినా యీ పథకాలు పట్టణాల నుండి క్రమేణా పల్లెలకు చేరాయి ఈనాడు 'కుటుంబ నియంత్రణ' అంటే వేలాది కుటుంబాలకు తెలుసు: గాని కోటానుకోట్ల జనాభాలో వేలసంఖ్య యేమాత్రం?

'కుటుంబ నియంత్రణ' యెందుకు అమలు చేయాలనే విషయం జనాభాలో దాదాపు సగానికి పైచిలుకు ప్రజలకు తెలియకపోవటం నిజమనిపిస్తోంది. మన దేశంలో రోజుకు 55 వేలమంది శిశువులు జన్మిస్తున్నారు. 1964 సంవత్సరంలో వున్న జనాభా 47.2 కోట్లు కాగా అది 1976 నాటికి 64.8 కోట్లు, 1986 నాటికి 85.6 కోట్లు కాగలదని జనాభా రేటు ప్రకారం అంచనా వేయబడినది. ఈ ప్రకారం జనాభా పెరిగితే దేశం యేమౌతుందనే భయం కలుగుతోంది. మనదేశంలో దాదాపు నూటికి 80 మంది వ్యవసాయంమీద ఆధారపడినా ప్రజలకు కావలసినంత వుత్పత్తి లేదనవచ్చు. కాగా జనాభా పెరుగుదలవలన తల్లులు రోగగ్రస్తులు కావటం, నిరుద్యోగ సమస్య ఆర్థిక సంక్షోభం మొదలైన యితర బాధల నెదుర్కోవటం మరొక సమస్య. ఇలాంటి దుర్భర పరిస్థితులలో కొన్ని యితర దేశాలకు మల్లే మనదేశంలో కూడ 'కుటుంబ నియంత్రణ' అనివార్యమని సర్వత్రా అంగీకరించబడుతున్నది.

అయితే, నేటి పరిస్థితుల్లో 'కుటుంబ నియంత్రణ' పథకాలు, వుద్యమాలు అనేక అవరోధాలను యెదుర్కోవలసి వస్తున్నది.

అన్నిటికంటె ముఖ్యమైన అవరోధం మనదేశంలోని నిరక్షరాస్యత. మొత్తం




జనాభాలో దాదాపు 24 శాతం మాత్రమే చదువరులైనపుడు ప్రభుత్వాశయాలను ఆచరణలోకి మార్చగల విజ్ఞానం యెలా లభిస్తుంది? ఎంతటి మహత్తరమైన దృశ్య, శ్రావ్య పరికరాలను ప్రచారానికి వాడినా నిరక్షరాస్యత అనే పిశాచం ప్రజల జ్ఞానేంద్రియాలను బంధించి వారిని మూగజీవులుగా మారుస్తున్నది.

మరో అవరోధం మనదేశంలోని ఆచార వ్యవహారాలూ, పిచ్చి నమ్మకాలూను. సంతాన నిరోధం అనగానే సనాతన ధర్మపరాయణుల ఆవేశం తాళప్రమాణమై యీ పథకాలను అనుసరించే వారిని మత విధ్వంసకులుగా భావిస్తున్నది. చాలామంది 'దేవుడిచ్చిన అమృత ఫలాలను చేజేతులా నాశనం చెయ్యబూనటం మహాపాతకం' అంటున్నారు.

ఇంకొక అవరోధం మనదేశంలోని మహిళలకు పుట్టుకతో యేర్పడిన బిడియం, సిగ్గూను. ఆమె నెలతప్పిందని నలుగురూ అనుకుంటే సిగ్గు, అనుకూల దాంపత్యం లేదంటే సిగ్గు, ఆ పూటకు బియ్యం లేకపోతే పొరుగింటావిడను అడగటం సిగ్గు. ఇంత బిడియంగల మన సమాజంలోని స్త్రీ ఆసుపత్రిలో నర్సుల చేయి తగిలినా కుంచించుకుపోవటంలో అసహజత్వ మేమీలేదు.

మనదేశంలో యీ పథకాల నిర్వహణకు మరో పెద్ద అవరోధం ఆర్థిక దుస్థితి దేశమంతటా మారుమూలల్లో, కొండకోనల్లో రవాణా, వార్తా సౌకర్యాలు లేని ప్రాంతాల్లో —అన్నీ కలిపి దాదాపు ఆరులక్షల గ్రామాలున్నాయి. తగినంత ప్రచారానికి, కుటుంబ నియంత్రణ అమలు చేయగోరువారికి తగినట్లు ఆకర్షణీయమైన ప్రతిఫలం లేదా పారితోషికం యివ్వటానికి మనకు డబ్బులేదు.

డిగ్రీలూ, పట్టాలు పొందిన డాక్టర్లు పట్టణాల్లోనే తిష్ట వేసుకొని పల్లెలలో నివసించటానికి విముఖత చూపటం మరో అవరోధం.

ఈ పథకాలు, వుద్యమాలు విజయవంతం కాగలవా లేదా అనే సందేహానికి యీనాడు ఆస్కారం లేదు. మనదేశం అక్షరాస్యత, ఆర్థికపరిస్థితిలో యెంత వెనుకబడివున్నా ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికలవల్లనూ, అనేక సంక్షేమ సంస్థల కృషివల్లనూ, అవధులమేరకు జరిపిన ప్రచారంవల్లనూ ప్రజల్లో కొంత సంచలనం కలిగింది. జీతం చాలని వుద్యోగులూ, రాబడి చాలని వర్తకులూ, వుత్సాహవంతులైన విద్యావంతులూ యీనాడు తమంతటతామే కుటుంబ నియం

క్షణ కేంద్రాలకు హాజరై ఆపరేషన్ చేయించుకుంటున్నారు. పంచాయితీ సమితులలో చాలాచట్ల అధ్యక్షులూ, ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలలోని సిబ్బంది తగుదక్షతతో యీ పథకాల నిర్వహణలో పాల్గొంటున్నారు.

ఈ పథకాలు విజయవంతం కావటానికి ముఖ్యంగా వైద్య, ఆరోగ్య శాఖాధికారులు నిర్విరామ కృషిచేయాలి. 2 వ ప్రపంచ యుద్ధానంతరం (జపాను రాజ్యవిస్తరణ కాంక్ష అంతరించటంతో) జనాభా 73 మిలియన్లకు పెరిగిపోయింది. ఇది చూచి 'గర్భధారణ, ప్రసవంవల్ల తల్లికి శారీరకంగాగాని ఆర్థికంగాగాని ఆరోగ్యం క్షీణిస్తుందని తోచినయెడల ముందుగానే గర్భస్రావం చేయటం జరుగున'ని ఒక చట్టం అమలులోకి వచ్చింది దాంతో 1949లో లక్ష పై చిలుకు గర్భస్రావాలు కాగా 1955 నాటికి 11 లక్షలు దాటింది. తర్వాత డాక్టర్ కోయా అను ఆరోగ్య శాఖాధికారి 3 గ్రామాలను యెన్నుకొని గర్భనిరోధక సాధనాలతో ప్రయోగం చేయగా మూడోసంవత్సరానికి జనాభారేటు వెయ్యికి 30 వున్నది వెయ్యికి 14.6 కి తగ్గింది. తర్వాత డాక్టరు కోయా ఒక బొగ్గుగని కార్మికుల గ్రామంలో ప్రయోగం చేయటంతో మూడేండ్లనాటికి గని కార్మికుల కుటుంబాల్లో నూరింట 90 మంది కుటుంబ నియంత్రణ అమలు చేయటం జరిగింది

ఢిల్లీ సమీపంలోని 'నారేలా' అనే గ్రామంలోని ప్రాథమిక ఆరోగ్యకేంద్రంలో గత సంవత్సరం 'బచ్చాబంద్' (పిల్లలు వద్దు) అనే పథకం అమలు జరుపగా యెంతోమంది స్త్రీలు స్వయంగా వచ్చి 'లూప్' సాధనం అమలు చేసుకున్నారు. 8 మాసాల్లో ఆ గ్రామంలోని 175 మంది స్త్రీలు 'లూప్' సాధనం వినియోగించుకున్నారు. ఇలాగే దేశంలోని అన్ని ప్రాంతాలలోను కుటుంబనియంత్రణ యెడ సుముఖత కనిపిస్తోంది.

1966 సంవత్సరం మే నెలనాటికి మనదేశంలో 8 లక్షలమంది స్త్రీలు 'లూప్' వినియోగించారు. 1976 నాటికి 1 కోటి 30 లక్షలమంది యీ విధానం అమలు చేయాలని ప్రభుత్వ లక్ష్యం. దాదాపు 10 లక్షలమంది పైగా పురుషులు గత మే నెల నాటికి 'కుటుంబ నియంత్రణ' పథకం అమలు చేసుకున్నారు.

పై పరిస్థితులలో 'కుటుంబనియంత్రణ' యెంతవరకు విజయవంతం అయినదీ స్పష్టమవుతున్నది. ప్రభుత్వం, అధికార వర్గాలు, అనధికార ప్రముఖులూ తగినంత దీక్ష, దక్షతతో యీ కార్యకలాపాలను నిర్వహించటం ముఖ్యం. అనాదినుండీ యింటికి వచ్చి బట్టలు తడుపుకొనే పూర్వాచారపరాయణుల కుటుంబాల్లో యీ నాటి పిల్లలూ, యువకులూ, తుదకు పెద్దలూ బట్టలు తడుపుకుంటున్నారా? వ్యసనాలకు బానిసలై నార్సిష్ తాగేవారుగాని మద్రాసులో మద్యపాననిషేధం అమలు జరగటంలేదా? కాబట్టి యీ రోజుల్లో యే పథకాలుగానీ వుద్యమాలుగానీ విజయవంతం కావనుకోవటం శుద్ధ అవివేకం.

పోతే, యీ పథకాలూ, వుద్యమాలూ — అంటే కుటుంబ నియంత్రణ సంబంధమైనవి విజయవంతం కావటానికి ప్రజలు వహించవలసిన పాత్ర అతి ముఖ్యమైనది. గ్రామాల్లో యీ నాడు కావలసినంతమంది వుపనాయకులున్నారు. ముందుగా వీరి కుటుంబాల్లో కుటుంబ నియంత్రణ పథకాలను అమలు చేస్తే వారి అనుయాయులైనా యితరులకు తప్పక నమ్మకం కలుగుతుంది.

కుటుంబ నియంత్రణ పథకాల గురించి ప్రజలలో ప్రచారానికి తగుచు వైద్య, ఆరోగ్యశాఖల అధికారులు, సమితి సిబ్బందీ, ముఖ్యంగా ముఖ్య సేవిక, గ్రామ సేవికలు వస్తూవుంటారు. గ్రామనాయకులు వారికి తగు సహకారమిచ్చి ప్రజలకు పథకాలపై నమ్మకం కలిగించాలి.

గ్రామాల్లో వున్న యువజన సంఘాలు, మహిళామండళ్లు, గ్రామ సభలు నామమాత్రంగా గాక మురికిపేటల్లో, హరిజనవాడల్లో ప్రచారాలు చేసి యీ పథకాల ఆగత్యమెంత ముఖ్యమో దృశ్య, శ్రావ్య సాధనాలద్వారా నిరూపించాలి.

ఆపరేషన్లు, యితర సాధనాలు ఆరోగ్య భంగం కలిగిస్తాయనే దుష్ప్రచారాన్ని ఖండిస్తూ వుండాలి పురుషులకు వేసెక్టమీ, కండోంల వుపయోగం, స్త్రీలకు

# డాక్టర్ కబుర్లు

## మీరు ఏ రకం పేషంటు?

స్థూలంగా చెప్పాలంటే రెండు రకాలవాళ్లు ఉన్నారు. మొదటిరకం ఎప్పుడూ తన జబ్బుని గురించే ఆలోచించగలిగిన వ్యక్తి! దానిని గురించే సంభాషణ అంతా. ఎందులు అంతరిక కనిపించేటన్న ప్రదర్శన. ఆలోచనలు రోగంతో ముడిపడిపోం. ఉంటాయి.

అందరిమీదా విసుగు. "నేనంటే సానుభూతిలేదు! అనో "మీ సాను భూతి నాకు అనవసరం!' అనో కసురు కుంటూఉండేరకం (దగ్గిర వారిమీద).

బాధ కలిగిస్తున్న దేహభాగం అంటే ఇంకా కోపం—"ఈ పాడు చెయ్యి!" లేదా "ఈ దిక్కుమాలిన చెవి..." వగయిరా. కొన్ని సమయాలలో ఆత్మనింద కూడా కద్దు—"అంతానేను చేసిన పాపాలకి పరిహారం......"

రెండవరకం సంగతేవేరు. జబ్బు రాగానే డాక్టరుని సంప్రదించటం, తగిన జాగ్రత్తలు తీసుకొనటం ఈ రకంవారి లక్షణాలు.

ఈ రకం పేషంటులు తమ జబ్బుని గురించి అధికంగా బాధ్యతపడరు. బాధపడరు.



మీరు ఏ రకానికి చెందినవారు?

హెచ్. ఎల్. హెర్షాసెస్

(కాపీరైటు)

ట్యూబెక్టొమీ, ఫోం మాత్రలు, జెల్లీ, లూప్, డయాఫ్రాంల వుపయోగం గురించి సంక్షేమ సంస్థలు ప్రజలకు యెప్పటికప్పుడు తెలియజేస్తూ వుండాలి.

ఈ పథకాల నిర్వహణకు, విజయానికీ

## కుటుంబ నియంత్రణ...

స్త్రీలు వహించవలసిన పాత్ర యెంతైనా వుంది. మనదేశంలోని మహిళలు అనాది నుండీ పాతివ్రత్యానికీ, సమయాసమయాల్లో సాహసపరాక్రమాల ప్రదర్శనకూ పేరు పొందారు. పట్టణాలలోని స్త్రీలు అలంకరణకూ, ఆడంబరాలకు ప్రతినిధులైతే పల్లెల్లోని స్త్రీలు కాయకష్టాలకూ, అమాయికత్వానికీ ప్రతినిధులు. అర్థరూపాయంత బొట్టూ, అనాగరికమనిపించుకొనే కట్టూగల గ్రామీణ స్త్రీలలో ప్రచారం చేయటానికి చదువరులూ, సంస్కారభావాలు గలవారూ ఐన స్త్రీలే పూనుకోవాలి.

పంచాయితీ సమితులలోనున్న ముఖ్యసేవిక, గ్రామసేవికలూ యథాలాపంగా తిరగటం గాక గ్రామాల్లో యింటింట ప్రచారం చేయాలి మహిళామండళ్లను మరింత పటిష్టంగా నడిపి యీ వుద్యమంలో అందరికంటే ముందుగా సర్పంచ్, గ్రామాధికార్ల యితర వుపనాయకుల కుటుంబాల స్త్రీలు ముందుకు రావాలి.

సీలాటి రేవుల్లోగానీ, విరామ సమయంలోని యిష్టాగోష్ఠిలోగానీ చతురులైన స్త్రీలు యీ పథకాలపై యితరుల దృష్టిని మళ్లిస్తూ మాట్లాడాలి. వైవాహిక జీవితం యెంతో ఆనందదాయకమై స్వర్గసుఖాలనిస్తుందని తలచిన స్త్రీలకు సంతానం యెక్కువైతే యెలాంటి దురవస్థలు సంభవిస్తాయో అనుభవం పొందిన స్త్రీలు యువతరం వారికి తెలియజెప్పాలి.

ఉపాధ్యాయినులు సమితివారి అనుమతితో స్త్రీలకై వయోజన విద్యా కేంద్రాలను నిర్వహించి యీ పథకాలను బోధించాలి. ఈ సందర్భంలో ప్రభుత్వంవారిచ్చే పారితోషికాల విషయం తెలియజేయాలి ఢిల్లీ ప్రాంతంలో నిటుంబ నియంత్రణ అమలు జరిపేవారికి 'ట్రాన్సిస్టర్లు' కూడా యిస్తున్నారు క్రమేణా మన ప్రాంతాలకు కూడా రావచ్చు. అయితే ట్రాన్సిస్టర్లకు బదులుగా తలా రూ 250లు చొ. యిచ్చినా యీ గడ్డు రోజుల్లో బీద కుటుంబాలకు ఒక ఆశ కలిగిస్తుంది.

ఈనాడు స్త్రీలు ప్రతి రంగంలోనూ పురుషులతో పోటీపడి శాయశక్తులా కష్టపడుతున్నారు ఉద్యోగాల్లో, రాజకీయాల్లో కళారంగంలో— అన్నింటా స్త్రీలుపాల్గొంటున్నారు. అట్టివాళ్లకు 'కుటుంబ నియంత్రణ' పథకం గురించి విరామ సమయాల్లో ప్రచారం చేయటం యేమంత కష్టం కాదు. అంతేకాదు. మగవాళ్లకు కనువిప్పు కలిగించగలరు కూడా.









# యాస్నయా పోల్యానా

గతశతాబ్దం మాట. రష్యాలోని యాస్నయా పోల్యానా గ్రామంలో ఒక భవనంలోనికి వెళ్లాడు ఒక అమెరికన్. ఆ భవనం యజమాని ఒక పెద్ద భూస్వామి అప్పుడే గుర్రపు బండిలోకి ఎక్కి బయటికి వెళ్లిపోతున్నాడు. అమెరికన్ అతనిని సమీపించి తనని తనే పరిచయం చేసుకుని తనూ బండిలో వస్తానన్నాడు. అందుకోసమే ఈ గ్రామానికి వచ్చానన్నాడు భూస్వామి సౌమ్యుడు వెంటనే అంగీకరించాడు. పదిమయిళ్ల దూరంలో ఉన్న ఒక గ్రామానికి వెడుతున్నాడు. దారి అంతబాగా ఉండదు. ఎగుడు దిగుళ్లు ఎక్కువ. 20 మయిళ్ల ప్రయాణం పూర్తిచేసి ఇద్దరూ ఇంటికి తిరిగి వచ్చారు.

'మీరు ఒక్కసారి కూడా కొరడా వాడటం చూడలేదు!' అన్నాడు అతిథి ఆశ్చర్యంతో.

'లేదు. నేను నా గుర్రాలతో మాట్లాడుతాను, కొరడాతో కొట్టను,' అని జవాబు చెప్పాడు ఇంటి యజమాని

అతని పేరు లియోటాల్‌స్టాయ్. రచయితగా, తత్వవేత్తగా జగత్ ప్రసిద్ధి పొందినవాడు. లియోటాల్‌స్టాయ్ 1829లో జన్మించాడు. చిన్నప్పుడే తలిదండ్రులని పోగొట్టుకుని చుట్టం ఒకావిడ దగ్గర పెరిగాడు. విద్యాభ్యాసం పూర్తిచేసుకుని సైన్యంలో చేరాడు. 1854లో టర్కీతో జరిగిన యుద్ధంలో పాల్గొన్నాడు. 1857లో సైనికోద్యోగం వదులుకుని, యూరప్ యాత్ర చేశాడు. ఈ యాత్రలో కనిపించిన లోకాయత నాగరక ధోరణులు కొన్ని అతనికి అసహ్యకరంగా కనిపించాయి ఫ్రెంచి రచయిత రూసో ప్రభావం అతని మీద చాలా కనిపిస్తుంది యూరప్ యాత్ర ముగించిన టాల్‌స్టాయ్ రచనలో పడ్డాడు 'వార్ ఎండ్ పీస్': 'అన్నాకరీనినా' ప్రపంచ ఖ్యాతిపొందిన నవలలు. టాల్‌స్టాయ్ రచనలలో మానవుడి అతి గాఢానుభూతుల చిత్రణ కనిపిస్తుంది. ఆత్మపరీక్ష ఆత్మవిమర్శ టాల్‌స్టాయ్ ప్రత్యేక గుణాలు అనవచ్చు

1862లో టాల్‌స్టాయ్ పెళ్లి అయింది అతని వివాహజీవితం సుఖమయినది అనలేము. ఈ కాలంలోనే టాల్‌స్టాయ్ మాస్కోకి వెళ్లటం సంభవించింది అక్కడ పేదప్రజల కష్టాలు అతనిని బాగా కదిలించివేశాయి. నైతిక సిద్ధాంతాల స్వరూపాలు కొన్ని అతని మనస్సులో ఘనీభవించాయి, మత సంస్థలమీద ఏహ్యభావం పుట్టింది. చర్చి అధికారాన్ని తిరస్కరించాడు. బైబిలు చదివి అందులోని ధర్మసిద్ధాంతాలని కొన్నిటిని అవగాహన చేసుకుని తనకి అర్థమయిన పద్ధతిలో కొత్త సూక్తులు కొన్ని సృష్టించాడు. జీసస్ సందేశాన్ని 'పాపాన్ని ఎదిరించకు' అనే మాటలలో చెప్పవచ్చు అన్నాడు టాల్‌స్టాయ్. టాల్‌స్టాయ్ మతం సారాంశాన్ని ఈ విధంగా చెప్పవచ్చు 'జీసస్ చాలా గొప్ప మనిషి అతను దేవుడి కుమారుడు కాబట్టి అతని బోధన నిజంకాదు. అది మానవుడి అంతఃకరణపు వెలుగుతో సమానమయినది.' కాబట్టే అది నిజం. బుద్ధుడు, ఇతర మతప్రవక్తలూ కూడా చాలా గొప్పవారు. సత్యంమీద ఎవరికీ ప్రత్యేక హక్కులేదు. భగవంతుడు మనలోనే ఉన్నాడు. భగవంతుడి రాజ్యం మనలోనే ఉంది.'

సత్ ప్రవర్తనద్వారానే సుఖాన్ని పొందవచ్చు తోటిమానవులపట్ల ప్రేమ, సంయమనము-- ఇవే సుఖశాంతులకి సాధనాలు. క్రౌర్యం ఎన్నటికీ చెడ్డదే. అందుకనే యుద్ధం మహాపాపం, బలవంతంగా ఏలే ప్రభుత్వాలనీ, కాని దుష్ట ప్రభుత్వాలే. కాని, దుష్టప్రభుత్వాల నయినాసరే శాంతియుతంగానే ఎదిరించాలి అందరికీ చెందిన వాటిమీద ఒకడు అధికారం చెలాయించటం పాపం. కరుణ. సానుభూతి ఇవి రెండూ అన్ని ప్రాణులపట్లా చూపాలి మాంసాహారం, మద్యం, మత్తుపదార్థాలు పుచ్చుకోరాదు. (పొగాకు కూడా మంచిదికాదు) ఇతరుల ప్రయాసఫలితాలమీద మనం జీవించరాదు.

టాల్‌స్టాయ్ సిద్ధాంతాలు ప్రపంచ ఖ్యాతి పొందయి గాంధీమహాత్ముడు కూడా ఇతని ప్రభావానికి బాగా లోనయ్యాడు. లియోటాల్‌స్టాయ్ 1910లో మరణించాడు.

—ఎస్






అన్నయ్య నా గురించి లోకనాథంగారికి రాసిన ఇంగ్లీషు- ఉత్తరంలోని తెలుగు భావం —

'వీడు నా తమ్ముడు. అక్కడే ఉద్యోగం చేస్తున్నాడు. వీడికి మా వూరంటే వల్లమాలిన అభిమానం. ఖర్మకొద్దీ వీడ్నెవెరో దూరంగా అక్కడికి విసిరేసేరు పాపం. గనక వీడి విషయమేమిటో కనుక్కొని, వీలుంటే (నాకు తెలుసు నీ పరపతి) మళ్లీ మా వూరికి బదిలీ చేయించే విధానం ఆలోచించు. నువ్వేదైనా ఆలోచిస్తే మార్గం నిమిషాల్లో కనుపిస్తుంది. ఉంటాను. శేషు.'

ఈ సిఫారసు ఉత్తరాన్ని అన్నయ్య నాకు పోస్టు చేసేడు. ఉత్తర మొచ్చి మూడు రోజులయింది ఈ మూడురోజుల్లో నే నా ఉత్తరాన్ని చాలా తడవలు చదివేను. లోకనాథంగార్ని కలుసుకుని వారికీ ఉత్తర మిచ్చేస్తే—నేను మా వూళ్లో వాలిపోయి నట్టే లెఖ్ఖ! కానీ, ఈ మూడు రోజులూ నేను ఆఫీసు పనిలో తలనిండా మునిగి పోవడంచాత వారిని కలుసుకోలేదు.

మా అన్న సాధారణంగా ఎవరికీ ఎటువంటి ఉత్తరువూ రాయడు. పై పెచ్చు ఇలాటి అవకతవక సిఫారసులంటే వాడికీ వొళ్లు మంట. ఇక్కడీవూళ్లో లోకనాథంగారి గురించి నే నింతకుమునుపే విని వున్నాను. వారి 'యశస్సు' తెలుసుకుని నే నెంతో ఆశ్చర్యం చెందేను. వారికీ భూమ్మీదున్న విలువ గణనీయమని నాకు తెలిసిన క్షణం ముందనేకమందికి తెలుసు.

సాక్షాత్తు, ఈ లోకనాథంగారు మా అన్నకి ఆత్మీయులని తెలీదు. నే నీ లోకనాథంగార్నింతకుముసుపు చూడనూ లేదు.

మా ఆఫీసులోనె, శ్రీ వార్ని బాగాతెలిసిన పురుగొకటి వున్నది పురుగుపేరు సీతాపతి. పాపమది విషప్పురుగు మాత్రం కాదు. సాధువు. బహుమెత్తన. అయితేనేం. లోకనాథమనబడే ఒకానొక వింతైన నీడలో బతుకుతున్న మనిషి గనక, సీతాపతి ఎంతో దర్జాగా, ధీమాగా వుంటాడు.

రెండురోజుల క్రితం సీతాపతిని శ్రీవారి తీరుబాట్లవైన మడిగేను. మే మప్పుడు క్యాంటీన్లో తీరుబడిగా కూర్చునివున్నాం. నేసతి ప్రేమతో అందించిన కాఫీని ఆరగా ఆరగా తాగుతూ సీతాపతి చెప్పేడు.

'వారు ఉదయం నిద్రనుంచి లేస్తారు. ఏడూ, ఎనిమిది మధ్య వారికి తెల్లవారుతుంది. లేచి, కాలకృత్యాలు ముగించి, కాఫీ పుచ్చుకుని హాల్లో కొస్తారు. అక్కడ కొచ్చిన జనాభా యొక్క కష్టసుఖాలు తెలుసుకుని, కారుమీద నగరంలోకి వొచ్చేస్తారు. మధ్యాహ్నం లంచ్, మూడింటి వరకూ నిద్ర. తర్వాత టీ. సాయంత్రం ఆరుగంటలకి ముసాఫై నగర ప్రవేశం.

ఇదండీ మాస్టారూ! టూకీగా వారి కార్యక్రమం.'

అందుచేత సరిగ్గా మూడవుతూనె నేను శ్రీ వారింటికి బయలుదేరేను. దార్లో, వారు టీ పుచ్చుకుంటూన్న దృశ్యాన్ని ఆలోచించేను. అప్పుడు వా రెంతో ప్రశాంతంగా వుండగలరని నమ్మేను. నడక వేగం పెంచేను.

నే నా భవనం ముందు నించున్న వేళ సరిగ్గా మూడున్నరయింది.

సాధారణంగా, ఎప్పుడు గూడా దేనికీ భయపడేమనిషిని కాదు నేను. కొంచెమో, గొప్పో రౌడీ వెధవని గూడాను. నేను చదువుకునేరోజుల్లో నాకా పేరున్నట్టు జ్ఞాపకం.

డోంట్ కేర్ గాడిన్నేను. అలాటి దేమిటో ఆ భవనాన్ని చూస్తున్నప్పుడు నేను భయపడిపచ్చేను.

మా ఖుల్లేం గుడిసెగానీ, పాక గానీ కాదు నెంబర్ వన్ పకడ్బందీ డాబా! మా యింటికి అటుపక్కా యిటుపక్కా మేడలున్నాయి. ఆ మేడల్ని చూచి నేనెప్పుడూ భయపడలేదు. అలాగే ఈ నగరంలోనూ, నేను కొన్ని మేడల్నిచూచీ గూడా భయపడలేదు

లోకనాథంగారి మేడని చూచిం తర్వాత ఎందుకో గుండె ఝల్లు మన్నది నెమ్మదిగా లోపలికి ప్రవేశించేను అక్కడి వాతావరణం యావత్తూ మండిపోతూన్న ధరల్లాగా మెరిసిపోతోంది. అక్కడి కొచ్చిపడే గాలి సైతం తెగబలిసిన ఖరీదులా తోచింది మెట్లెక్కేను కాలిజోళ్లక్కడ విడిచేందుకు సిగ్గుబడి మళ్లా కిందికి దిగేసేను. ఈ ఎక్కడం, దిగడంవల్ల జోళ్లకున్న మట్టి అద్దంలాటి ఆ గచ్చుమీదున్నట్లు గమనించి బాధపడ్డాను చాలా విసుక్కున్నాను గూడా

జోళ్లని మెట్లకిందే వుంచి, మెట్లెక్కి పైకొచ్చేను. గుమ్మందగ్గిర నించుని గొంతు సవరించుకున్నాను. అంతలోనే, బెదిరిపోయేన్నేను.

ఎవరో ఆడకూతురు, పొందిగ్గా కూచుని సంగీతంలో సంగతి పలికినట్టు కమ్మగా నవ్వడం నేను స్పష్టంగా విన్నాను. అక్కడే ఆగి లోనికి తొంగి చూసేను.

హాల్లో సోఫాలు చాలా వున్నాయి. మరీ అందమైన సోఫాలో ఓ దేవత తలని వెనక్కి వాల్చి మేడమీదికి దృష్టి నిలిపి నవ్వేస్తోంది. ఆమెనంటి పెట్టుకున్నట్టు ఆమె పక్కనే ఒక మగవాడు (అతనూ అందంగానే వున్నాడు. మరీ, అతని మీసాలెంతో నాజూగ్గా వున్నాయి) అతను సిగరెట్టు నుసిని ఆష్‌ట్రేలో రాలుస్తూ ఏదో ముచ్చటిస్తున్నాడు.

దేవత కంఠం నాకు స్పష్టంగా కనిపించింది. ఆ కంఠం దరిదాపులంతా వైభవంగావుంది ఆ ప్రాంతమంతా కేవలం బంగారంచాత తయారు కాబడినదని ఫోటో తీసి పేపర్లోవేసి జనంచాత అవుననిపించవచ్చు.

కొంద రాడవాళ్లని చూచినప్పుడు వాళ్లేం తింటున్నారో ఆరా తీయాలని పిస్తుంది నాకు. పొయ్యిమీద వెసట్లో యిన్ని బియ్యమేసి వుడకబెట్టడం మూలంగా తయారైన 'అన్నం'అనే పదార్థాన్ని ఎవరో నాలాటి దురదృష్టవంతులు మినహా ఆ దేవతలు తినరనిగూడా నే ననుకుంటాను. వాళ్లంతా యాపిల్‌పళ్లు తిని, ద్రాక్షపళ్ల రసం తాగి, మధ్య మధ్య బంగారాన్ని భోంచేస్తారు కాబోలనుకుంటాను. నాలాగా వాళ్లకి అలుబు చేయదు. అస్సలు జబ్బనేది రానే రాదు ధుఃఖం తెలిదు. ముసలితనం రాదు. మరణించరు. 'ఇక్కడ అందమూ దొరుకును' అనే పాయింటుని వాళ్ళు ప్రచారం చేసేటందుకు ఈ భూమ్మీద కొచ్చివుంటారు. అవునంతె, అదే కరెక్ట్.

ఇంతలో ఆ మగవాడు నన్నుచూసి 'యిస్' అన్నాడు.

అలా 'యస్సం'టే ఏమిటో అర్థంగాక ఇబ్బంది పడ్డాను ఇందాకటి అతని జోక్‌కది (ఎంచేతంటే, ఆ దేవత యింకా తల దించలేదు) పొడిగింపా లేక నన్ను పలకరించే అంటమైన పద్ధతా ? (నేను నీళ్లు నమిలేను)

'కమిన్' అన్నాడు.

ఆయనకి నమస్కారం చేసేను. సాక్షాత్తు వారే లోకనాథంగా గ్రహించేను ఆయన లోకనాథం గనకనే ఆ అందాలరాశిని అంత దగ్గిరిగా దాచుకో గలిగేడు

['భళిరా బాబూ' మీ అదృష్టం చూస్తుంటే, నాకు మండిపోతోంది. నా జీవితమ్మీద రోత కలుగుతోంది. నే నిప్పుడు సూయిసైడ్ చేసుకోవాలి. కనీసం, మరో జన్మకైనా మంచి బతుకిస్తానని దేవుడిచాత హామీ పుచ్చుకునిగానీ నేను మళ్లీ ఈ వెధవ జన్మెత్తను గాక ఎత్తను'] వారికి దగ్గిరిగా వెళ్లి నించున్నాను.

అప్పుడా యువతి తలదించి నావేపు చూచింది కరెక్ట్! ఆవిడ నూటికి నూరుపాళ్లు దేవతే ! నే ననుకున్నదంతా నిజం. ఆ కళ్లూ (చేపలు), ఆ ముక్కూ (కోటేరు) ఆ నోరు (బహు తమాషాగా, చిన్నది) ఆవన్నీ దేవతలకే వుంటాయి. కానీ, ఆమెని పరీక్షగా చూచినవెంటనే సిగ్గుచేతను, అవమానం చేతనూ నేను కృంగిపోయేను. 'ఆఫ్టరాల్ నువ్వా తల్లీ !' అని అనుకున్న మాట నిజమే. కానీ ఆఫ్టరాల్ ఈ దేవతనేనా నే నాశ్రయించబోయేది అని గ్రహించి విల విల్లాడి పోయేను.

శకుంతల, తన కళ్లల్లో ఆశ్చర్యాన్నీ మొహంలో యింత ఎక్సైట్‌మెంటునీ నింపుకుని 'వండర్' అన్నది.

ఆ వండరేమిటో నా కొక్కడికే తెలుసు. ఎంత కీర్తికీ, హోదాకీ, వారసులైతేనేం — ఆ లోకనాథం గారికేం తెలుసు ? గనకనే వారు తెల్లబోయి ఓ లిప్తకాలం శకుంతల వేపూ, మరో లిప్తకాలం నావేపూ టకా టకా చూచి, సిగరెట్టు దమ్మొకటి గట్టిగా పీల్చి మవునంగా వుండిపోయేరు.

'నిజమే శకుంతలా ! వండరే ! నిన్ను ఆశ్రయించేందుకే వొచ్చాన్నేను. నీలో యింత పసుంటుందని నాకా రోజుల్లోనే తెలుస్తే—అప్పుడే నిన్ను చంపేసి వుందును. తెలుసుగా—నే నత్తరౌడీవెధవ నారోజుల్లో ఇప్పుడు నా కోరలూడి పోయాయి. గళ్లలుంగీ, కారాకిళ్లీ, పలుపుబెల్టూ అన్నీ పోగొట్టుకుని కామన్‌క్లర్కు బోడిగుమాస్తానైపోయేన్నేను. గెలుపు నీది ఐశ్వర్యం, ఆర్భాటం అన్నీ నీవే. నీ యిష్టం శకుంతలా ఇప్పుడు నువ్వేమైనా అను – నన్నుమాత్రం మా వూరికి బదిలీచేయించు. దట్సాల్' అనాలనుకున్నాను. వాటిల్లో ఒక్క మాట గూడా గొంతు పెగిలిరాలేదు

'ఓ దేవుడా ! మళ్లీ ఎన్నాళ్లకు చూశాన్నిన్ను' అన్నది శకుంతల ఇంగ్లీషులో.

(నా కేడుపొచ్చేస్తోంది శకుంతల తలిచిన దేవుడే నన్నీపక్షంలో గొప్పవాడిని చేసిపారేస్తే నా చేతికి రెండు పిస్తోళ్లిస్తే టిష్యూ ... టిష్యూ...కాల్చిపారేద్దును. నాకా అదృష్టం లేదంతె)

'మిస్టర్‌రావ్ ! ఇతను అరవైలో, నాతో పాటు కలిసి చదువుకున్నాడు. బి. ఎ. మేథ్స్ ఏవరేజ్ స్టూడెంట్. అల్లర్లో మాత్రం ఫస్టు. కదు మిస్టర్...'

'నా పేరు వాసు' అన్నాను.

(వసుదేవుడు గాడిదకాళ్లు పట్టుకున్న దృశ్యం నా కళ్లముందు వెలిగింది)

'కరెక్ట్ మిస్టర్ వెంకట వాసుదేవ మూర్తి, రోల్ నెంబర్ సెవెంటీఫోర్. మగవాళ్లలో లాస్ట్‌నేమ్ సెవెంటీ ఫైవ్ మిస్ అరుంధతి. షింహాచ్‌నా ఎట్ వైజాగ్. నా నెంబర్ సెవెంటీ ఎయిట్'

'వెరీగుడ్. చాలా గుర్తున్నాయి మీకు.' అన్నాడతను. మిస్టర్‌రావ్ !

(మిస్టర్‌రావ్ పేరు లోకనాథంకాదు.

## జెలసీ

పైగా—భార్యని భర్త 'మీరు'ని సంబోధించ రాదు. గనక రావ్ శకుంతల భర్త కాడు. అతను ఒక మానవుడు. మంచి 'గీత' గల మగవాడు. అందుచేత అతనివేళ లోకనాధం స్థానంలో కూచున్నాడు.)

'మీట్ మిస్టర్ రావ్! ఎ ఫ్రెండాఫ్ మైన్.'

నేను రావ్‌ని మీటవ్వకూడ దనలు. కాని, తప్పలేదు. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో కరచాలనం చేసేను. అప్పుడు గూడా ఆ పక్షి శకుంతలకి దూరంగా జరగనూలేదు. కనీసం లేవనూ లేదు.

వాక్కు మొచ్చిందిగాని జోరెత్తలేక పోయేను.

రావ్ నన్ను కూచోమన్నాడు. ఎదురుగా వున్న సోఫాలో కూచున్నాను.

'ఏదో విశేషం లేకపోతే విశాఖ్కకి రారు. చెప్పండి.' అన్నది శకుంతల.

(ఎలా చెప్పేది? ఏమని చెప్పేది? పోనీ, చెప్పేదేమిటి? నా చిరుగుల బతుకు గురించి, బరువు జీవితం గురించి చెప్పేదా? ప్లీజ్ శకుంతలా నన్ను మావూరికి తోలు శకుంతలా. శకుంతలా ప్లీజ్. నీ చేతులివి శకుంతలా— కళ్ళకద్దుకుని పోతాను శకుంతలా అని యాచించేదా? ఏవీ తోచకుండా వుంది! ఏదొకటి చెప్పాలి. తప్పదు.)

'ఫర్వాలేదు చెప్పండి. రావ్‌గారేం పరాయి వారు కాదు. మా వారికి ఆంతరంగిక స్నేహితులు. చెప్పండి.' మళ్ళీ శకుంతలే అనేసింది.

(తన మొగుడి యొక్క ఆంతరంగిక స్నేహితుడు శకుంతల పక్కగా ఒకే సోఫాలో అంటిపెట్టుకు కూర్చోవచ్చు తప్పులేదు. ఆ మరో పరాయి వెధవ నిక్షేపంగా చూచి భరించవొచ్చు. అదీ తప్పుకాదు. నిన్ను ప్రేమించేను శకుంతలా! అని ఉత్తరం రాసి దాని కింద సంతకం చేయకపోతే తప్పా? బాగుందమ్మోయ్! మంచి పాఠాలే!)

నేను చెప్పేను—

'లోకనాథంగార్ని కలుసుకునేందుకు వొచ్చేను.'

'అరెరె ... చెప్పేరుకాదు. వారు రాత్రే బొంబాయి వెళ్ళిపోయారు. మరో వారాని గ్గానిరారు. ఎలా?... అంతర్జంటు మేటరేమైనా వుందా. అభ్యంతరం లేకపోతే నాతో చెప్పండి. అవసరమైతే ట్రంక్ బుక్ చేద్దాం'

లోకనాథంగారి భార్య నాకు తెలిపిన ఆ

# తలనొప్పా?

# సారిడన్ 'రోష్' వేసుకోండి

## నొప్పి మటుమాయమై...



## ...మీకు నవోత్సాహము కలుగుతుంది!

**అదే సారిడన్ యొక్క ప్రత్యేకత!** నొప్పిని, దాని వలన కలిగే శ్రమను పోగొట్టుటయేగాక, హాయి నవోత్సాహములనుకూడ కలిగించుటకై సారిడన్ ఒక ప్రత్యేక సూత్రముతో తయారు చేయబడినది. దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! నొప్పి, శ్రమ మటుమాయమై, సరిగ్గా ఆలోచించ కలుగుతారు ... పని యందు ఆసక్తి కలుగుతుంది ... స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు ... ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, సేద దేర్చును, నవోత్సాహమును కలిగించును. ఎల్లప్పుడు సారిడన్‌ను మీ దగ్గర వుంచుకోండి. పిల్లలకు ¼ నుంచి ½ బిళ్ల వరకు మాత్రమే వాడాలెను.

[illegible]




తలనొప్పి
పంటినొప్పి
ఒంటినొప్పి
బహిష్టునొప్పి

ఒకే ఒక సారిడన్‌తో మటుమాయమవుతాయి!

'రోష్' తయారు
ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్ లిమిటెడ్

శకుంతల కాపోతే, నేను సర్వం విస్మరించి వుండేవాడిని. కానీ ఇంత తెలిసిన తర్వాత నా దుస్థితిని యిక్కడ మనవి చేయాలని పించలేదు. లోకనాథమయ్యేదీ బ్రహ్మదేవు డయ్యేగీ, ఈ మనిషి శకుంతల భర్తయితే నేను ఛస్తే ఏం చెప్తాను అందుచేత వెంటనే నేను ప్లేటు మార్చేను

'మరేం లేదు మా బ్రదర్ నాకో ఉత్తరం రాసేరు— వీలైతే లోకనాథంగార్ని కలుసుకుని త్వరగా అడగమని ఉత్తరమొచ్చి వారం రోజులైనా వీల్లేక వార్ని కలుసుకో లేకపోయేను. ఇవాళ తీరుబడి చిక్కింది గదాని వస్తే—'

'వారు లేకపోయేరు'

'ఫర్లేదు మరేం ఫర్లేదు. మరోమాటె ప్పుడైనా కలుసుకుంటాను. ఆఫ్‌కోర్స్— ఊటీ ప్రయాణం వాయిదా పడితే నేను లోకనాథంగార్ని అతి త్వరలోనే కలుసు కుంటాను.'

'ఊటీనా?'

ఆశ్చర్యపోతూ అడిగింది శకుంతల అప్పు డామె కళ్లు మరింత పెద్దవయ్యాయి. రావ్ కొంచెం ముందుగి వంగేడు. ఆ స్థితిలో వాళ్ళిద్దర్నీ చూస్తుంటే నాకు చెడ్డ సరదా అనిపించింది. ఇక నేను గుర్రం దిగను దిగను గాక దిగను. ఏం? ఎందుకు దిగాలి లసలు? నాకు బదిలీ అయ్యేప్పుడే అవుతుంది కదూ. మా వూరిమీద బెంగ పెట్టుకుని నగానికిసగమై పీనుగనైపోతాను. అయినా సరే, నా చాతకానితనాన్ని, నా అసమర్థతనీ, నా తక్కువతనాన్ని వాళ్ల ముందుంచను.)

'అవును. ఊటీనే అవుతే ప్రోగ్రామింకా సెటిల్ కాలేదనుకోండి. మొత్తానికి ఎప్పుడో ఒకప్పుడు వెళ్లక తప్పదు.'

'ఏమిటో విశేషం?' శకుంతలే అడిగింది

చాలా తమాషాగా నవ్వేసేను. నా జేబులో చేయి పెట్టేను. సిగరెట్లయితే వున్నాయి గానీ, అవి బొత్తిగా పూర్ క్వాలిటీ! నా ముందున్న రావ్ రీజెంట్ కాలుస్తున్నాడు. చేతిని గబిక్కున లాగేసేను.

అతను నా అవస్థని గమనించేడు కాబోలు అతని దగ్గరున్న సిగరెట్టు పాకెట్టు నా ముందుంచేడు. దాన్లోంచి ఓ సిగరెట్టు పుచ్చుకుని ముట్టించేను.

(లాగించు వాసూ! లాగించు. ఈ ఛాన్స్ ఛస్తే వొదిలెట్టకు. నువ్విప్పుడు డిగ్రేట్‌వి బెంగపడొద్దు. నీ యిష్టం వొచ్చినట్టు వాగేయ్. అనే వాడు లేడు. చూడప్పుడే పక్షి నిన్ను గౌరవించేస్తోంది. అర్భకుల్లా బాబూ! నీ ధాటికి ఆగలేరు మొదలెట్టు)

'సారీ మిస్టర్ రావ్! సిగరెట్లు మర్చిపోయేను.'

'ఫర్లేదు. కాల్చండి.'

'నాకీ మధ్య కొన్ని కొత్త అభిమానాలు వచ్చాయి శకుంతలగారూ! ఇంతవరకూ పత్రికలూ, రేడియోలూ నన్ను ప్రోత్స హించేయిగదా—'

'అంటే' అడిగేడు రావ్.

'నేను చెప్పడం మరిచేనండోయ్ రావ్‌గారు! వాసుగారు మంచి కథలూ నాటకాలు రాస్తారు. ఈ ఆర్గ్‌వారికి చదువుకునే రోజుల్నుంచే వుండేది.'

ఎంతైనా, శకుంతల నిజమే చెప్పింది. అప్పుడు శకుంతల మళ్లా నాకు ఓ దేవత లా కనుపించింది.

'ఈజిట్?' అన్నాడు రావ్ ఎంతో ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ.

(దేవుడా రక్షించేవ్! ఈ దౌర్భాగ్యుకి జాతకానికి కథలు రాయడమనే అందమైన క్వాలిఫికేషనిచ్చి నన్నింతమంది అదృష్ట వంతులమధ్య మాట్లాడగలతాహతుని ప్రసా దించేవ్. లేకపోతే— ఈ నిర్భాగ్యుడింతకాలం బతికివుండేవాడు కానేకాదు.)

తిరిగి నేను నా కథ ప్రారంభించేను.

'ఇప్పుడేమి సినీమావాళ్ల దృష్టిలో తిన్నగా వున్నాను. నా కథొకటి ఈ మధ్య పెద్ద హిట్టయింది. ఒక ప్రొడ్యూసరొచ్చి ఆ కథే కావాలన్నాడు. కొంచెం మార్పు లవసరమన్నాడు. శ్రమనుకోకపోతే, మాటలూ నన్నే రాయమన్నాడు. వొప్పుకున్నాను. తప్పు లేదు మరి. స్క్రిప్ట్‌వర్కు పూర్తయింది. ప్రొడ్యూసరు స్క్రిప్ట్ చూసి వండర్‌ఫుల్ అనేసేడు. కంప్లీట్ ఔట్‌డోర్‌వర్క్. ఊటీ— లొకేషన్. దాన్లో తమాషాగావుండే చిన్న పాత్రొకటి నేనే ఖచ్చితంగా వేసితీరా లని పట్టుబడితే దానికీ యొప్పన్నాను. అదీ విషయం.' అన్నాను కసిగా, మత్తుగా.

శకుంతలా, రావ్ యిద్దరూ ఒకేతడవ ముందుకి వొరిగేరు. నాకు ఉత్సాహం రెట్టింపయింది.

'ఈ నెలాఖర్లోగా నేను వెళ్ళాల్సి వుంటుంది'

'హౌ లక్కీ యూ ఆర్!' అన్నది శకుంతల.

'మీరు కథలే రాస్తుంటారా? ఉద్యోగం గట్రా...'

(నాకు తెలుసురా గురూ! ఉద్యోగంలో నీది పెద్ద చెయ్యి అని నీ వాలకమే చెబు



తుంది గనక ఆ ఫీల్డ్‌లో నేను నీకంటే తక్కువే. కాని, తమ్ముడూ—అది గూడా నేను ఛస్తే ఒప్పుకోను. కాచుకో.)

అన్ని వివరాలు చెప్పకముందు నా ఉద్యోగ మేమిటో చెప్పవలసివొస్తే నేను సిగ్గుపడి వుండేవాడినే మొగానీ, ఇప్పుడు నేను వాళ్లిదరి మధ్యా పెరిగిపోయివున్నాను గనక నేనేం చెప్పినా చెల్లుబడి అవుతుందంతే. ఫలానా మంత్రివర్యులు రోడ్డు వెంట నడిచే వెడతారు, ఫలానా ప్రముఖ సినీనటుడు బయటెంతో నిరాడంబరమ్మైన తాటాగింట్లో కాపురం చేస్తారు, ఫలానా లక్షాధికారి (అతి మంచి వాడు) ఎల్లప్పుడూ నేతబట్టలే ధరిస్తారు—వగైరా వగైరాల్లో, ఆ పెద్దలు సిగ్గు పడరు. పడకూడదు. గనక ఇప్పుడు నా స్థితీ అదే. అందుచేత నే నతి తేలిగ్గా నా విష యం చెప్పగలిగేను—

'గుమాస్తాని. అంతా కలిపి రెండొందలు దాటదు నా జీవితం. పగలంతా ఉద్యోగం రాత్రి కొన్ని గంటలు రచనా వ్యాసంగం. కేవలం ఈ రచనలమీదనే సంపాయిస్తాను త్రీటూ ఫోర్ హండ్రడ్స్. ఇక ఉద్యోగం మానుంటారా అది మొక్కుబడి.'

ఇది విని వాళ్లేం మాటాడలేదు. అసలు నేను వాళ్లకి గుమాస్తాలా కనిపించివుండను బందరనబడే మా వూరు బదిలీకోసం, కాలికి బలపం కట్టుకున్న యాచకుడునని వాళ్లకి తెలీదు. చవకబియ్యం, కొబ్బరినూనె, లైఫ్ బాయ్ సబ్బు, నెలకింతని చెప్పి చారిచాలని వెచ్చాలు, రెండు మూడు సినిమాలు సరదాగా (మహా వెళ్లగలిగితే) బెజవాడ వెళ్లడం లాటి జీవితానికి నేను వారసుడనని వాళ్ల కన్నులు తెలీదు. దాంతో నేను మరింత పేట్రేగిపోయేను. పైగా—కొన్నేళ్లనుంచి నా గుండెల్లో దాక్కున్న కసిగాడా సరిగ్గా అప్పుడే పనిచేసింది కథలు రాసే మనిషినీ, నిమిషానికో కథ చెప్పగల చాతుర్యం వున్నవాడినీ గనక—పాపం, ఆ పసి వాళ్లని ఆడించి పారేసేను. అ ఆ, ఇ ఈ, ఉ ఊ అని అక్షరాలూ, ఇది కుక్క, ఇది ఆవు అని మాటలూ నేర్పేను. ఆ రావ్‌కి నాలుగు రోజులూ, ఆ శకుంతలకి నాలుగు సంవత్స రాలూ నిద్రపట్టనంత పనిచేసేను.

నాకు జెలసీ ఎక్కువ, నాకు కోపం ఎక్కువ. నాకు దుఃఖం ఎక్కువ. అన్నీ ఎక్కువే. నేను నటుణ్నిగూడాను. ఆ కార ణంగా వాళ్లిద్దరూ నా వాగ్ధాటికి అదిరి పోయేరు రావ్ దగ్గర మూడు రీజెంట్స్ కాల్చేను. శకుంతల స్వయంగాతెచ్చిన డ్రింక్ తాగేను. వాళ్లిద్దరూ నా ముందర అతి వినయంగా కూర్చుని నా మాటలూ, నా కలలూ, నా కథలూ అన్నీ వోపిగ్గా విన్నారు.

వాళ్ళిద్దరి మధ్యా ఇప్పుడు బాగా ఖాళీ ఏర్పడింది. సోఫాకి ఒకకొసన రావ్, మరో కొసన శకుంతలా కూర్చున్నారు. వాళ్ళిద్దరి మధ్యా మరో మనిషికి చోటుంది. అక్కడ నేను కూచుని కాళ్ళు రెండూ సరదాగా కదిలిస్తే ఇబ్బంది లేనంత సరదా కలిగింది.

నాటకాల నటీమణులు నాకు అనేకమంది తెలుసు. వాళ్ళందరూ చెడ్డవాళ్ళని నేను చెప్పను. కొందరు గడుసువాళ్ళున్నారు. గడుసువాళ్ళకి నాటకాలే గాకుండా, ఇతరత్రా చిన్న చిన్న చిట్కాలూ తెలుసు. అతి సామాన్యమైన మనిషిని పట్టుకుని వాళ్ళని ఉత్సాహపరిచే నిమిత్తం 'నువ్వింద్రుడివి, చంద్రుడివ'ని పొగిడి పారేస్తుంటారు. అది వాళ్ళ వృత్తి. వాళ్ళు నాటకాలు వేయవలసి వాస్తే కొన్ని నియమాలు, పద్ధతులు ఇచ్చి తింగా మాట్లాడుతారు ఆ సమయాల్లో వాళ్ళ పక్కన ఎవరో ఒక మగరాజు వుండి తీరాలి వారెవరైనదీ వాళ్ళ కనడసరం మగ తోడు అవసరం అదిరూలు ఈనాడిక్కడ శకుంతలనీ, రావ్‌నీ చూస్తుంటే నాకు ఆ జాతిలక్షణం అకస్మాత్తుగా స్ఫురించింది. నవ్వేసేను. వాళ్ళిద్దరూ నన్ను విడ్డూరంగా చూడటం గమనించి చిన్న ఉపకథ చెప్పేను—

'మరేంలేదు. వెనకటిరోజులూ, ఆనాటి మా కాలేజీ, అక్కడ మా గొడవలూ, మా పంతాలూ, ప్రేమలూ—ఇవన్నీ గుర్తుచేసు కున్నప్పుడు నేను నవ్వుకుంటాను. అంతే.' అన్నాను చాలా గొప్పగా.

వెంటనే శకుంతల మాటందుకున్నది.

# జెలసీ

'మరొకటి రావుగారూ! ఈ వాసు నాకారోజుల్లో ప్రేమలేఖ రాసేరు. అయితే రాసి దానికింద సంతకం చేయడం మరిచి పోయేరు. పిటి మా అన్నయ్య వాళ్ళేమో ఈ కేసు ఇన్వెస్టిగేట్ చేసి వాసుగార్ని ముద్దా యిగా నిలబెట్టి చాలా గొడవ చేసేర్లెండి పాపం. అదంతా గొప్ప తమాషా!'

అనేసి గబగబా నవ్వేసింది శ్రీమతి శకుంతలాదేవి కానీ, నాకా నవ్వు దేవత నవ్వినట్టులేదు. కేవలం చీర, రవికా తొడు క్కున్న ఆడది నవ్వినట్టుంది. నాలాగా భోజనం చేసే, నాలాగ దుఃఖించే, నాలాగా జీవించే మనిషి నవ్వినట్టుంది. శకుంతల చెప్పిన ప్రమోదంతం విని గూడా రావ్ కొంచెమైనా నొచ్చుకోలేదు. పైగా, మందహాసం చేస్తో అన్నాడు—

'అవును సుమీ! ఈ కథలూ అవీ రాసే రాళ్ళు ఒకప్పుడు ప్రేమపక్షులనే సూత్రాన్ని వీరూ నిజం చేసేరు వాసూ!'

(నా ప్రేమ కదిలింది. ఇది ఆగదు నా ప్రేమలో థ్రిల్ లేదు నా ప్రేమలో జీవం లేదు, సరిగమలు లేవు, సుగంధంలేదు నా ప్రేమ చచ్చి పోయింది. నాకు ప్రేమలేదు చచ్చిన ప్రేమ గుర్తుకొస్తే నేను నిశ్చింతగా బతకలేను ప్రేమ నన్ను ఛీకొట్టింది అవమానించింది. ఈ ప్రేమ చర్చ ఇంతటితో ఆగిపోవాలి. అప్పుడే నాకళ్ళల్లో నీళ్ళు తిరుగున్నాయి. నేను మళ్ళీ అల్పుడినై పోగలను. వెళ్ళిపోవాలింక. లేవాలి)

నేను లేచి నించున్నాను.

వాళ్ళిద్దరు గూడా లేచి నించున్నారు.

నేను రెండు చేతులూ జోడించేను.

'అప్పుడే వెళ్ళిపోతారా?' శకుంతల బాధగా అడిగింది.

'ఇప్పుడే వెళ్ళిపోవాలి!' అన్నాను తమాగా, రావ్‌తో కరచలనం చేస్తో కొంచెం గొప్పగా అన్నాను.

'గుడ్ డే మిస్టర్ రావ్! ఐ విల్ సీ యూ ఎగైన్'

రావ్ సిగ్గుపడిపోయేడు.

శకుంతలతో అన్నాను—

'లోకనాథంగారొచ్చిం తర్వాత, నేనీ వూళ్ళో వుంటే తప్పకుండా మళ్ళీ వొస్తాను. అందాకా శెలవా మరి!'

'అంటే? వారు లేకపోతె వీరీ యింటికే రారా? అదేం కుదరదు రేపు సండే ఈ యింట్లో వీరు చేయి కడుక్కోవాలి రావ్ గారు కూడా వొస్తారు. వీర్రాకపోతె నా మీద వొట్టు!'

(చచ్చిపోయిన నా ప్రేమ మళ్ళీ బతికిందా? ఈ బతికిన ప్రేమని నేనిప్పుడు భరించగలనా? ప్రేమమీద ఒట్టట! భేష్. ప్రేమ అతిదీనంగా మాటాడుతున్నప్పుడు నా కెందుకో భయం కలుగుతోంది. మళ్ళీ ఏడుపొచ్చే సూచనలు కనుపిస్తున్నాయి. క్విక్. త్వరగా వెళ్ళిపోవాలి పద.)

వాళ్ళతో ఏమీ చెప్పకుండానే బయటకొచ్చేసేను జోళ్ళు తొడుక్కున్న తర్వాత, ఒకరాయిని గట్టిగా తన్నేసి అద్దెగది కొచ్చి చేరేను.

ఆరాత్రే, అన్నయ్యరాసిన సిఫారసు ఉత్తరాన్ని కాల్చి పారేసేను. మంచమ్మీద వాలి పోయి, దిండులో తలదూర్చి వలవలా ఏడ్చేను.

మా వూరు బందరు. అక్కడ రోడ్లు నాకు బాగుంటాయి. అక్కడ మైదానాలు నాకు నచ్చుతాయి. అక్కడ మనుషులందరూ మంచివాళ్ళు. అక్కడ సముద్రం, అక్కడ గాలి, నేల, నీళ్ళు—అన్నీ బాగుంటాయి.

కాని, ఇంతలో నాకావూరు బదిలీకాదు. నేను మనిషినీ కాలేను.









పశ్చిమ దేశపురాజు మల్లన్నమంత్రి రాజ్యం మీాదకు దండెత్తి రావడానికి ప్రయత్నం చేస్తున్నట్లుగా మల్లన్న మంత్రికి తెలిసింది. పశ్చిమ దేశపు రాజును యింకా ఉపేక్షించడం మంచిది కాదని మల్లన్న మంత్రి తానే సైన్యాలను తీసికొని అతని మీాదకు దండెత్తి వెళ్ళి పశ్చిమ దేశపురాజు కోటను ముట్టడించాడు.

పశ్చిమ దేశపురాజు కోట చాలా బలమైంది కాబట్టి మల్లన్న మంత్రి సైన్యాలు దానిలో ప్రవేశించలేక పోయేయి. మల్లన్న మంత్రి సైన్యాలు చాలాకాలం పాటు కోటను ఘుట్టడించి ఉండడం వలన కోటలోపల జనానికి ఆహార పదార్థాలు కరువైపోయేయి. అందుచేత పశ్చిమదేశపురాజు, మల్లన్న మంత్రి విధించిన షరతులకు అంగీకరించి సంధి చేసికొన్నాడు.

మల్లన్న మంత్రి పశ్చిమ దేశం నుండి తిరిగి తమ రాజ్యానికి బయల్దేరే సమయంలో వాయవ్య దేశపు రాజు కూడా తమ మీాదకు దండెత్తడానికి ప్రయత్నాలు చేస్తున్నాడని మల్లన్న మంత్రికి తెలిసింది. వెంటనే మల్లన్న మంత్రి వాయవ్య దేశం మీాదకు దండయాత్రకు బయల్దేరమని సైన్యానికి ఉత్తరువు యిచ్చాడు.

అప్పటికే తమ దేశం నుంచి బయల్దేరి చాలా కాలమైంది కాబట్టి వెంటనే మరొక దండయాత్రకు బయల్దేరడం సైనికులకు యిష్టం లేదు. కొంతమంది సైన్యాధికారులు మల్లన్న మంత్రికి యీా సంగతిని చెప్పేరు. వాయవ్య దేశపు రాజుమీదకు వెంటనే దండెత్తకపోతే అతను యింకా బలాన్ని చేకూర్చుకొంటాడని మల్లన్న మంత్రి అభిప్రాయం. అందుచేత వెంటనే తమ సైన్యం వాయవ్య దేశం మీదకు దండెత్తాలని పట్టుపట్టాడు మల్లన్న మంత్రి.

మల్లన్న మంత్రి సైన్యం వాయవ్య దేశం వైపు ప్రయాణం చేసింది. వాయవ్య దేశపు రాజధానికి కొంత దూరంలో పెద్ద నది ఉంది. మల్లన్న మంత్రి సైన్యం ఆ నదిని దాటి ఒడ్డునే మకాం చేసింది.

'తాము ఊహించిన దానికంటే వాయవ్య దేశపురాజు యెక్కువబలాన్ని సమకూర్చుకొన్నట్లుగా అక్కడ మల్లన్న మంత్రికి తెలిసింది. ఈ సంగతి సైన్యానికి తెలియగానే తిరిగి తమ దేశానికి వెళ్ళిపోయి తరువాత మళ్ళా రావచ్చుననే కోరిక వారిలో బలపడ సాగింది.

అప్పుడు మల్లన్న మంత్రి తాము నదిదాటిన పడవల నన్నింటినీ ఒక చోటకు చేర్చవలసిందిగా భటులకు ఆజ్ఞాపించాడు. సైనికు లందరూ చూస్తుండగానే ఆ పడవలను కాల్చి వేయించాడు మల్లన్న మంత్రి. దాన్ని చూసి సైనికు లందరూ నిర్ఘాంత పోయేరు. మల్లన్న మంత్రి అప్పుడు సైనికులను ఉద్దేశించి యిలాగ అన్నాడు.

'మీారు చూస్తుండగానే మనం

(72 వ పేజీ చూడండి)

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్



## రైలుబండ్ల పట్టాలమార్పు

(శ) రైలుబండ్ల పట్టాల మార్పు :

ఒక శతాబ్దం క్రిందట—కొత్తగా రైలు బళ్ళు ఉపయోగంలోకి వచ్చిన రోజులలో— చిత్రమైన ఇబ్బందులు తల ఎత్తేవి ఒక స్టేషనుదగ్గర చిన్న 'లూప్ లైను' ఉంది. ఆ లూప్‌లో 8 బోగీలు కాని, ఒక




ఇంజను ఏడు బోగీలు కానీ, పడతాయి. ఇటువంటి చోట ఒకరోజున రెండు రైలు బళ్ళు ఎదురెదురుగా వచ్చి ఆ లూప్‌లో ఇరుక్కుని, ఎదరకు పోవడానికి వీలులేని స్థితిలో చిక్కుకున్నాయి. ఒక ఇంజను 16 పెట్టెలు ఒక బండికీ, ఒక ఇంజను 16 పెట్టెలు మరో బండికీ ఉన్నాయి.

ఆ రైలు డ్రైవర్లలో ఒకడు రెండవ డ్రైవర్ని బండిని వెనుకకు నడిపించి వెనుక స్టేషనుకి తీసుకు పొమ్మన్నాడు.

'కావాలంటే నువ్వే వెళ్ళు వెనక్కి' అన్నాడు. ఆ రెండో డ్రైవరు.

'నాకు చాలా తొందర పని ఉంది.' అన్నాడు మొదటివాడు.

'నాకూ ఉంది' అన్నాడు రెండవ వాడు.

ఒక రైలులో ప్రయాణం చేస్తున్న లెక్కల ప్రొఫెసరు ఒకాయన ఈ చిక్కును గమనించి, దానిని విడదీసే మార్గం చూపించాడు. అప్పుడు ఆ రైళ్ళు తమ తమ దారిని ఎదరకు వెళ్ళిపోయాయి.

ఆ రెండు రైళ్ళు చిక్కునుంచి బయట పడే మార్గం సాధ్యమైనన్ని తక్కువ 'ఎత్తులలో' చూపించగలరా? ఈ సమస్యను పేక ముక్కలు ఉపయోగించి చేస్తే సులభంగా తెములుతుంది. 16 నల్ల ముక్కలు బోగీలుగాను. ఒక నల్లని ఆసు ఇంజను గానూ ఊహించుకో వచ్చు, అల్లాగే రెండో రైలును ఎర్రని ముక్కలతో సూచించ వచ్చు)

* * *

(చ) గుణకారంలో వింత :

ఈ క్రింది గుణకారంలో చమత్కారం చూడండి.

15 × 93 = 1395

గుణించడానికి ఉపయోగించిన 15, 93 అనే నాలుగు అంకెలే లబ్ధంలోనూ ఉన్నాయి (స్థల చలనం మాత్రమే కలిగింది) ఇటువంటి చిత్రమైన సంఖ్యలు ఇంకా ఉన్నాయేమో వెతకండి.

* * *

(ఛ) విలు విద్య :

విలు కాళ్ళు గురిచూచి ఈ బల్లమీది చక్రాలను కొడుతున్నారు. ఆ చక్రాలలో అంకెలు వేసి ఉన్నాయి. బాణం ఏచక్రంలో గుచ్చుకుంటే అన్ని 'పాయింట్లు' వస్తాయి.




సరిగ్గా 100 పాయింట్లు రావాలంటే ఎన్ని బాణాలు వెయ్యాలి?

## ఎలా నిలబడాలి



(జ) ఎల్లా నిలుచోవాలి ?

ముగ్గురు పిల్లలు వరసగా నిలుచున్నారు. వాళ్ళ చొక్కాల మీద 3,1,6 అనే అంకెలు వేసి ఉన్నాయి. 7 చేనిశ్శేషంగా భాగింపబడే సంఖ్య ఏర్పడాలంటే వాళ్ళు




ఎల్లా నిలుచోవాలి? ఉదాహరణలోకి బొమ్మలో చూపినట్లు నిలుచుంటే 316 అనే సంఖ్య వస్తుంది. కాని ఇందులో 7 నిశ్శేషంగా పోదు

(జవాబులు 72 వ పేజీలో)

jayadev



స్టూలు పక్కింటి వాళ్ళింట్లో వుందేమో అడిగొస్తాన్నే!

బట్టలు కూడా కాస్త 'పొదుపు'గా వాడ్డం నేర్చుకోవే అన్నా — అప్పట్నించి ఇదీ వరస!!

అయ్యో! వొంట్లో బాగోలేంది మావారికా? దండే- నా గూరం!!

ఆఫీసుకు టైము ఐంది- భోజనం రెడీయా?

అప్పుడే తెల్లారిందాండీ?

డ్రైవర్! కారు టాపు తీసెయ్!

jayadev

# వారఫలం

**13.10.1967 శుక్రవారం మొదలు**
**19.10.1967 గురువారం వరకు.**

**మేషం:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృషభం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. కొన్ని వ్యవహారాల్లో మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. వారాంతంలో అనుకోని చికాకులకు గురి కాగలరు. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవ ప్రతిపత్యాలు బాగా ఉంటాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. విద్యావైజ్ఞానిక రంగల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం:** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:** ఆదాయం మాట యెలాగున్నా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో అనుకోని చికాకులు కలుగుతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగ నమ్మడం తగదు. వ్యాపారంలో మాటపట్టింపులు రావచ్చును.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగ ఉండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కన్య:** వ్యాపారంలో పోటీదారితో పోటీ పెరుగుతుంది. ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల ఆధిక్యత అధికం కాగలదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**తుల:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు లాభించగలవు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు శ్రమమీద నెరవేరతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి గాని మీ స్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు:** వ్యాపారవిస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రాజకీయవ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగ నెరవేరుతాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో లాభిస్తాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగ ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకుంటారు.

**మీనం:** కొన్ని వ్యవహారాల్లో ప్రయాసవినాది, ప్రయోజనం మంలొకరిది కాగలదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్



# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఉపశమనముతో సహా రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది!

ఎఱ్ఱ లేబిలు

దగ్గు, జలుబులతో నీర్సముగా ఉండి రోగనిరోధక శక్తిని కోల్పోతారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశముంది.

వాటర్‌బరీస్ కాంపౌండులో గల ఓషధులు ఆకలిని వృద్ధి చేస్తాయి, కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి, ఇతర వ్యాధులు కలగకుండా రోగనిరోధక శక్తిని యిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియొసోట్' మరియు 'గయొకోల్' దగ్గు, జలుబుల నుండి ఉపశమనమును కలిగిస్తాయి.

బలము మరియు ఆరోగ్యమునకు
వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి!







వార్నర్-హిందూస్థాన్ లిమిటెడ్

# సెలవుల్లో



జె. సాయిప్రసాద్

సాయంత్రం దాదాపు ఆరున్నర గంటలు కావస్తూంది. అప్పుడే టెన్నిస్ ఆడి క్లబ్బు వరండాలో చేరాము, నేను, శ్రీనాథ్, గోపాలకృష్ణ, థామస్. అప్పటికే శర్మ కుర్చీలో చేరగిలబడి పేపరు చదువుతూ కనిపించాడు. శర్మ మా అందరికన్నా ఏడెనిమిదేళ్ళు పెద్దవాడు. ఈ మధ్యే జరిగిన ఒక కారు ప్రమాదములో కాలు ఫ్రాక్చర్ కావడమువల్ల, టెన్నిస్‌కి తాత్కాలికంగా స్వస్తి చెప్పాడు. మంచి ఆటగాడు కూడాను. అందుకే అతని కాలు త్వరగా నయము కావాలని అతని కన్నా మాకే ఎక్కువ ఆత్రంగా వుంది.

శర్మ ఎంత మంచి ఆటగాడో అంత మంచి మాటకారికూడా. ఆటలోను, మాటలోను నేర్పు కలవారు అరుదు కనుక అతడంటే మాకు చాల గౌరవం. తను ఏది చెప్పినా ఇతరులు ఆసక్తిగా వినేటట్లు చేయటములో అతనికి సరితూగే వ్యక్తిని నేనింత వరకు చూడలేదు.

బంతులను, రాకెట్లను బోయ్ చేతుల్లో పడేసి శర్మచుట్టూ చేరి కబుర్లు మొదలు పెట్టిన కొంచెం సేపటికి సన్నగా, గాలి, వాన ప్రారంభమైనాయి. ఇంతలో లైట్లు కూడా పోవటంతో మేమంతా వరండాలోనుంచి క్లబ్బు హాల్లోకి చేరుకున్నాము. అప్పటికే అటెండర్లు కొవ్వొత్తులు వెలిగిస్తున్నారు.

'ఈ వాతావరణము చూస్తే, దాదాపు పదకొండేళ్ళక్రితం జరిగిన ఒక సంఘటన జ్ఞాపకం వస్తుందోయ్. చెప్పమన్నారా?' అని అడిగాడు శర్మ. అతడేది చెప్పినా మాకు వినాలనుంటుందని తెలిసినా, మా చేత అడిగించుకోవటం శర్మకి సరదా. తప్పకుండా, అని మేము బుర్రలాడించగానే, చెప్పడము మొదలుపెట్టాడు.

'ఇది జరిగినప్పటికి నేను బెంగుళూరులో ఇంటర్ సీనియర్ చదువుతుండేవాణ్ణి. అంటే అది టైట్ పాంట్లు, సల్వార్ కమీజ్‌లు, ట్విస్ట్ రికార్డులులేనికాలం. అప్పట్లో మా నాన్నగారు ఆగ్రాలో పనిచేస్తుండటంవల్ల వేసవి సెలవలకి తప్ప, అక్కడికి వెళ్లటం వీలుపడేదికాదు. జూనియర్‌లో వుండగా దసరా, క్రిస్మస్ సెలవులను ఆంధ్రదేశంలోనే వున్న మా బంధువుల ఇళ్లల్లోనే గడిపేశాను. కాని సీనియర్‌లో వుండగా మా నాన్నగారు దసరా సెలవులకు ఊటీ వెళ్లి తన స్నేహితులైన కల్నల్ సోముడు

గారింట్లో వుండి రమ్మని వ్రాశారు. నాయుడుగారు ర్నంతకుముందు నే నెరుగను కనుక, అక్కడికి వెళ్ళాలంటే కొంత బిడియంగానేవుంది. కాని మా నాన్నగారు నేను వస్తున్నానని నాయుడుగారికి తెలియ చేసాననికూడ వ్రాశారు. అదీకాక వెళ్ళకపోతే మా నాన్నగారు నాకు వ్రాయబోయే ఉత్తరాన్ని తలచుకొని వెళ్ళడానికే నిర్ణయించుకున్నాను.

ఊటిలో నాయుడుగారు నాకు హృదయ పూర్వకంగా స్వాగతమిచ్చారు. ఆయన భార్య శాంతమ్మగారు కూడా చాలా ఆప్యాయంగా పలుకరించారు. వారికి పిల్లలు లేరు. నేను అక్కడ వున్నన్నినాళ్ళు నాకే లోటురాకుండా చూసుకున్నారు. నాయుడుగారు చాల కలుపుగోలు మనిషి. వారింటికి చేరిన కొద్ది సేపట్లో నా బిడియాన్ని పోగొట్టి బాతాఖానిలోకి దించారు. చిన్న వయస్కులతో ఆయనంత స్నేహంగా వుండేటట్టి మనుష్యులను నే నెక్కువగా చూడలేదు.

నాయుడుగారి ఇల్లు ఊటి టవున్‌లో ఒక ప్రశాంతమైన భాగములోవుంది. ఇంటి చుట్టూ పెద్దతోట కాస్త పురాతనమైన దిలా కనిపించినా, చాలా విశాలంగా వుంది దాన్ని తను ఒక యూరోపియన్‌వద్దనుంచి కొన్నానని నాయుడుగారు చెప్పినట్లు జ్ఞాపకం. ఇద్దరు, ముగ్గురు నౌకర్లు ఇంటి పనులు చేస్తుండేవారు.

నే నక్కడ చేరిన మొదటిరోజు ఎక్కడికి వెళ్ళలేదు. ఆ సాయంత్రం, నన్ను విశ్రాంతి తీసుకొమ్మని చెప్పి నాయుడుగారు క్లబ్బుకు వెళ్ళారు.

ఆ మరుసటిరోజు పొద్దున నాయుడు గారు తన కారులో ఊటిలో చూడవలసిన ప్రదేశాలన్నిటిని చూపించారు. ఊటి చాల సుందరమైన టవున్ అని వేరే చెప్పవలసిన అవసరములేదు. పూలతోటలన్ని నిండుగా కనిపించాయి. అది సెప్టెంబర్‌నెల కావడం వల్ల పగలంతా మేఘాలు కమ్మి అప్పుడప్పుడు చినుకులుకూడా పడుతున్నాయి.

మేము వూరంతా చుట్టి ఇల్లు చేరే టప్పటికి శాంతమ్మగారు మాకు భోజనం సిద్ధం చేశారు. భోజనంచేసి హాల్లో చేరి కాసేపు అవియివి మాట్లాడిన తరువాత, నాయుడుగారు నన్ను సాయంత్రం, తన చిరకాల మిత్రులైన డాక్టర్ శ్రీపతి గారింటికి తీసుకువెడతాను సిద్ధంగా వుండమన్నారు.

నేను, నాకని కేటాయించిన గదిలో చేరి ఏవో మాగజైన్లు తిరగేస్తూ నడుం వాల్చాను. నాకు నిద్ర ఎప్పుడు పట్టిందో తెలియదుగాని, నేను లేచేటప్పటికి దాదాపు అయిదున్నరగంటలైంది. బయట ఇంకా మేఘాలు ముసురుకొనేవున్నాయి.

తబాలున, నాయుడుగారు నన్ను సిద్ధంగా వుండమని చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది. గబగబముఖం కడుక్కుని బట్టలు మార్చుకొని హాల్లోకి చేరాను. శాంతమ్మ గారు మాత్రం సోఫాలో కూర్చుని కనిపించారు. నాకు టీ, గ్లాసు తెప్పించారు. తరువాత, నాయుడుగారు తన క్లబ్ మెంబరు ఒకరికి హార్ట్ ఆటాక్ రావటం వల్ల చూడ్డానికి వెళ్ళారని శాంతమ్మగారు చెప్పారు. అంతేకాకుండా నన్ను శ్రీపతిగారింట్లో వదలి రమ్మని డ్రైవరుతో కారును పంపించారు. నే నొక్కణ్ణే వెళ్ళడానికి తటాపటాయించడం చూచి శాంతమ్మగారు 'శ్రీపతిగారి కుటుంబం చాల సోషల్‌గా వుంటారని, సిగ్గుపడవలసిన అవసరంలేదని' చెప్పారు చిరునవ్వుతో.

నాకు వొక్కణ్ణే వెళ్ళడం అంతగా యిష్టం లేకపోయినా ఇక చేసేదేమి లేక నాయుడుగారి కారులో బయలుదేరాను. కారు నాకు అపరిచితం అయిన మూడు, నాలుగు రోడ్లు దాటి వూరుబయటికి సాగింది దాదాపు ఒక మైలుదూరం వెళ్ళినతరువాత ఒంటరిగా కనిపించే ఒక రెండంతస్తుల ఇంటిముందు ఆగింది. ఆ ఇంటిని చూడ గానే, నేను చూసిన మిస్టరీ సినిమాల్లోని ఇళ్ళు కొన్ని గుర్తుకొచ్చాయి. అసలు విషయము ఏమిటంటే ఇది, నాయుడుగారి ఇల్లే అనుకుంటే దానికన్నా పురాతనముగా వుంది. చాలా పెద్దదనే చెప్పాలి.

నేను కారులోంచి దిగింతరువాత, కారును మళ్లీ ఏడు, ఏడున్నరా ప్రాంతాలలో తీసుకొనివస్తానని వెళ్ళాడు నాయుడుగారి డ్రైవరు. వరండాలోకి వెళ్ళి తలుపుతట్టిన కొద్దిసేపటికి ఒక యువతి తలుపుతెరిచింది.

ఆమె నాకన్నా రెండు, మూడేళ్ళు పెద్దదనుకుంటాను. చురుకైన ముఖముతో చాల ఆకర్షణీయంగా కనిపించింది.

'ఎవరుమీరు' అని ప్రశ్నించింది

చెప్పాను.

'ఓహో, శర్మగారు మీరేనా ఇందాకే మీరు వస్తున్నారని నాయుడుగారు ఫోన్ చేసారు. లోపలికిరండి' అంటూ హాలులోకి దారితీసింది.

బయటనుంచి భీకరంగా కనిపించిన ఇంటి లోపల చాల నూతనంగాఉంది. హాల్లో ఒక పెద్దతివాచీ, రెండు సోఫాసెట్లు, ఒక పుస్తకాల బీరువా, ఓమూల టేబుల్, పైన ఫోన్, గోడలమీద ఐదారుఫోటోలు, అన్నీ చక్కగా అమర్చబడియున్నాయి. హాలులో నుంచి ఒకద్వారం ఇంటిలోపలి భాగానికి, మరొకటి పక్కనవున్న విశాలమైన తోట లోనికి తెరచుకొనివున్నాయి.

'కూర్చోండి, నాన్నగారు మేడపైన కాస్త బిజీగవున్నారు. కొంచెంసేపట్లో వస్తారు. అంతవరకు నాతో మాట్లాడటం మీకు అభ్యంతరము లేదనుకుంటాను. అన్నట్లు నాపేరు సునీత, చెప్పడము మరచాను' అని గడగడ చెప్పేసింది.

నేనొక సోఫాలో కూర్చున్నాను. ఆమె నా ముందున్న సోఫాలో కూర్చుంది. అప్పుడే గాలి, వాన మొదలుపెట్టినట్టుంది, తోట లోనుంచి చల్లగాలి నామెడవెనుక తగల సాగింది. ఏమి మాట్లాడుదామా అని అనుకుంటూవుండగానే, సునీతే మొదలు పెట్టింది.

'మీకు ఊటి నచ్చిందా? అయినా, బెంగుళూరు కున్న గ్లామరు ఊటికి లేదనుకుంటాను,' తన ప్రశ్నకు జవాబుకూడా తనే చెప్పింది. నిజమేనన్నాను, ఇంకేమి తోచక.

'ఊటిలో ఇంకా ఎవరితోను పరిచయం కాలేదా మీకు'

లేదన్నాను.

ఇంతలో, గాలి, వాన ధాటికి ఇంట్లోని లైట్లు పోయాయి. సునీత నౌకరును పిలిపించి కొవ్వొత్తులు వెలిగించింది. తోట వైపు తెరచియున్న ద్వారం గుండా చినుకులు అప్పుడప్పుడు నామీద పడుతున్నాయి. సునీత ఇది గమనించి,

'తోటవైపు ద్వారం మూయనందుకు మీరు క్షమించాలి. మా నాన్నగారు వింత స్వభావులు. వారికి ఆద్వారాన్ని సాయంత్రం సమయాల్లో మూసివుంచడం ఏమాత్రము ఇష్టంలేదు' అన్నది బాధ మిళితమైన

# సెలవుల్లో

స్వరంతో.

నాకు పెద్దగా ఆసక్తి లేకపోయినా 'ఎందుకు?' అని అడిగాను. సునీత ఇలా చెప్పసాగింది,

'ఇది విషాదగాథ అని మీకు మొదటే చెప్పాలి. ఇది జరిగి మూడేళ్ళుకావొస్తుంది. అప్పట్నుంచీ మానాన్నగారిలో ఈచలనం కలిగింది.

మా తల్లితండ్రులకు నేను, మాఅన్నయ్య లిద్దరుమాత్రమే సంతానము. మాఅమ్మ మేమంతా చిన్నవయస్సులో వున్నప్పుడే చనిపోయింది. అందుకే మానాన్నగారు మమ్మల్ని చాలాగారాబంగా పెంచారు.

మా అన్నయ్య లిద్దరికి అడవి బాతులవేట అంటే చాలా సరదా. ప్రతిసారీ సెలవులకు వచ్చినప్పుడు ఇక్కడికి మైలుదూరంలోవున్న కొలనుకువెళ్ళి ఒక చిన్న డింగీతో వేటాడటం వాళ్ళకి మామూలే. మూడేళ్ళక్రితంకూడా అదేమాదిరిగా మా పెంపుడు కుక్కను, తీసుకొని ఒకమధ్యాహ్నంవేళ కొలనుకు వెళ్ళారు. వెళ్ళే ముందు, సాయంత్రం త్వరగా వస్తామని, టీ వుంచడం మరచిపోవొద్దని కూడా చెప్పి ఆ తోటవైపు ద్వారంగుండా వెళ్ళారు. అంతే. తరువాత వాళ్ళిద్దరిని ఎవరు చూడలేదు. ఆ సాయంత్రానికి విపరీత మైన గాలివాన రేగింది. అన్నయ్యలిద్దరి కోసం ఆరోజు చాలసేపువరకు చూశాము, కాని నిష్ప్రయోజనం. గాలి. వాన మరుసటి రోజు ప్రొద్దునకుగాని ఆగలేదు. వాన వెలిసిన తరువాత నాన్నగారు, పోలీసువారి సహాయంతో కొలనువద్దకు వెతకడానికి వెళ్ళారు. కాని అక్కడ అన్నయ్యలజాడేమి కనిపించలేదు. వాళ్ళు వుపయోగించే డింగీకూడ కనిపించ లేదు. కొలనులో నీటిమట్టం తగ్గిన తరువాత వెతకగా, అన్నయ్యలు తీసుకొని వెళ్ళిన తుపాకులుమాత్రం బాగాతుప్పపట్టి కనిపించాయి. దానినిబట్టి మాఅన్నయ్య లిద్దరు ప్రమాదవశాత్తు కొలనులో మునిగి పోయివుంటారని, పోలీసువారు నిర్ధారణ చేశారు. అదే నిజమని నానమ్మకం. కాని నాన్నగారుమాత్రం అన్నయ్య లిద్దరు ఎప్పటి కైనా తిరిగివస్తారన్న భ్రమను ఇప్పటికీ వదలలేదు.

ఆరోజు అన్నయ్యలు తుదిసారిగా బయటకు వెళ్ళినది ఈతోటవైపు ద్వారంగుండానే అందుకనే నాన్నగారు ఎప్పుడూ ఆ ద్వారాని. తెరిచేవుంచుతారు. నాన్నగారికి అన్నయ్య లంటే ఎంతముక్కువంటే, ఇప్పటికీ, వాళ్ళిద్దరు కొనసారిగా బయటికి వెళ్ళినప్పటి సంఘటనను గురించి విపులంగా చెబుతారు. పెద్దన్నయ్య వేసుకున్న నల్లరంగు రెయిన్ కోటునుగురించి, చిన్నన్నయ్య సెనామాకేప్ పెట్టుకొని 'ఆవారా' సినిమాలోని పాటను పదేపదే పాడుకొంటు వెళ్ళడం గురించి చెబుతూవుంటే, అది అసంభవం అయినా నాక్కూడ చనిపోయిన అన్నయ్యలు తిరిగి వస్తారేమో ననిపిస్తుంది ఒక్కొక్కప్పుడు"

ఇంతలో శ్రీపతిగారు మేడమీదనుంచి దిగి వచ్చారు. ఆయన చాల భారీ మనిషి. షుమారు యాభైయేళ్ళుంటాయి. విశాల మైన నుదురు, ఫ్రెంచ్‌కట్ మీసంతో చాలాహుందాగా కనిపించారు. అంత రీవిగా వుండే వ్యక్తికి సునీత చెప్పినటువంటి విచిత్రమైన భ్రమ ఎలా కలిగిందా అని నాకు ఆశ్చర్యం వేసింది.

కరచాలనం చేసినతరువాత నాగురించి కుశలప్రశ్నలు వేయసాగారు. ఇంటర్ తరువాత ఏమి చదువదలుచుకున్నది, ఎక్కడ చదువ తలుచుకున్నది మొదలైనవి అడిగారు. ఆతరువాత నేను మౌనంగా వుండటం చూసి 'సునీత అన్నయ్యలు సుధీర్, సతీష్‌వుంటే నిన్ను బాగా మాటల్లో దింపివుండేవారు, అబ్బాయ్, వాళ్ళు వేటకని కొలనుదగ్గరికి వెళ్ళారు. వచ్చేసమయం కూడా అయింది. మామూలుగా ఈతోటవైపు ద్వారంగుండానే వస్తారు. అందుకనే వానజల్లు వస్తూన్నా తలుపు వేయలేదు, ఏమి అనుకోకు. సునీత నీకీవిషయం చెప్పేవుంటుందనుకుంటాను' అని అన్నారు.

నేను చటుక్కున సునీతవైపు చూశాను. సునీతకూడా నావైపే బాధగా చూస్తోంది. 'నీబాధ గ్రహించగలనులే' అన్నట్టుగా లేని గంభీర్యము తెచ్చుకొని సన్నగా నవ్వాను. శ్రీపతిగారుమాత్రం ఇదేమి గమనించినట్లుగా లేరు. మళ్ళీ మాటలధోరణిలోపడి ఊటీ గుర్రపు పందాలను గురించి చెప్పసాగారు. నేనుకూడా పరధ్యానంగా 'ఊ' కొట్టసాగాను.

ఇంతలో దూరంగా ఓకుక్క మొరగడం వినిపించింది. శ్రీపతిగారు తోటవైపు ద్వారం

దగ్గరికివెళ్ళి, 'అదిగో సుధీర్, సతీష్ వస్తున్నారు. బాగా తడిసినట్లున్నారు. ఈ వానాకాలంలో వేటా గ్రీటా వద్దంటే వినరు,' అని అన్నారు విసుగ్గా.

నేను మళ్ళీ సునీతవైపు చూసి, ధైర్యం చెపుతున్నట్లుగా నవ్వుదామనుకున్నాను. కాని ఆమె సంభ్రమాశ్చర్యాలతో కళ్ళు పెద్దవిచేసి తోటలోకి చూడసాగింది. నేనుకూడా గిరుక్కున వెనుకకు తిరిగిచూసాను.

నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను!! దూరంగా ఇద్దరు వ్యక్తులు, ఒక కుక్క గబగబ ఇంటివైపు రావడం కనిపించింది. వాళ్ళుకొంచెం దగ్గరకురాగానే, ఒకరు నల్లని రెయిన్‌కోటు, ఒకరు పెనామా కేప్ పెట్టుకొని భుజాలకు తుపాకులను తగిలించుకుని వుండటంకూడా గమనించాను. వాళ్ళలో ఒకరు 'గర్ ఆయా మేరా పర్‌దేశీ' అనే పాటను ఈలవేయడం కూడా వినిపించింది.

అంతే!

నేను వొక్క వుదుటున లేచి వరండావైపు వాకిలిని తెరచికొని నా శక్తికొలది పరుగెత్తాను. నా వెనుక, 'ఆగు, ఆగు' అన్న శ్రీపతిగారి కేకలు, కుక్క బిగ్గరగా మొరగడం మాత్రం వినిపించాయి. నేను ఏ వైపు పరుగెడుతున్నది కూడా గమనించ లేదు. చీకట్లో ఏదో తీగ నా కాళ్ళకు తగలడము, నేను ఏదో చెట్టుకు బలంగా గుద్దుకోవడం నాకు లీలగా జ్ఞాపకము. తరువాత నాకు స్పృహ తప్పిపోయింది.

నేను మళ్ళీ కళ్ళు తెరచేటప్పటికి శ్రీపతిగారింట్లో ఒక మంచముమీద పడుకుని వున్నాను. నా తలకు దెబ్బ తగిలినచోట కట్టుకట్టివుంది. మంచంకు ఒక పక్కనున్న కుర్చీలలో నాయుడుగారు, ఆయన భార్య, శ్రీపతిగారు కూర్చునివున్నారు. మరో పక్కన సునీతతోపాటు కూర్చున్న ఇద్దరు యువకులను చూసి వులిక్కిపడ్డాను. ఆ ఇద్దరిని చూసే నేను గాభరాపడి పరిగెత్తింది! సునీత నా వైపు కొంటెగా చూసి నవ్వుతావుంది ఆ ఇద్దరు యువకులు కూడా చిరునవ్వుతో చూస్తున్నారు.

శ్రీపతిగారు, వాళ్ళవైపు వారిస్తున్నట్లుగా సైగచేసి, నాతో, అబ్బాయ్, నీవు స్పృహ తప్పిపడ్డ తరువాత నిన్ను లోపలికి తెచ్చి, నాయుడుగారికి ఫోనుచేసి పిలిపించాము. మా అమ్మాయి సునీత, నిన్ను ఎలా బెదరకొట్టింది మాతో చెప్పింది. అమాయకులను ఏడ్పించటం సునీతకి చిన్నప్పట్నించి ఒక హాబీగా తయారయింది.

అసలు జరిగిన దేమిటంటే, నిన్ను చూడగానే అమాయకుడుగా గుర్తించింది మా సునీత. దాంతో నీకు ఒక కట్టుకథ అల్లి నిన్ను ఇబ్బంది పెట్టింది. నీకు మా కుటుంబం విషయాలేమి తెలియవని కనిపెట్టి, సుధీర్, సతీష్ లిద్దరు ప్రమాదవశాత్తు చనిపోయినట్లు, అందువల్ల నాకు కాస్త మతి భ్రమణం కలిగినట్లుగా చెప్పింది. నిజంగా నాకు మతి భ్రమణము కలగాలేదు, నా కొడుకులు చనిపోనులేదు.

సుధీర్, సతీష్‌లు ఈ రోజు ప్రొద్దునే వాళ్ళ కాలేజీలనుంచి వచ్చారు. మధ్యాహ్నం వేటకని వెళ్ళారు. వాళ్ళు తిరిగివచ్చే సమయానికి సరిగ్గా నీకు ఆ కట్టుకథ చెప్పి, వాళ్ళు రావడం చూసి తను కూడా చాల భయపడినట్లు నటించింది. దాంతో నీవు వాళ్ళను చూసి దడుచుకొని పరిగెత్తావు.

నీవు మిస్టరీ నవలలు ఎక్కువ చదివి వుండటం, ఈ రోజున్న భీకరమైన వాతావరణం. వాటికి తోడు మా సునీత కొంటెతనం, అన్నీ కలసి నీకు ఈ ఇబ్బందిని కలిగించాయి. ఏమి అనుకోకు,' అని అన్నారు.

ఇదంతా విని నేను సిగ్గుతో కుంచించుకుపోయాను అప్పుడు సుధీర్, సతీష్‌లు ఇందులో నా లోప మేమిలేదని, సునీత కొంటెతనానికి ఎటువంటివారైనా ఇదేఅవస్థ చెందేవారని, నన్ను వూరడించారు. ఇంతలో సునీత మా అందరికి వేడివేడి కాఫీతెచ్చింది.

అప్పుడు నాయుడుగారు 'ఏమమ్మా, నీవు చేసిన ఘన కార్యానికి సెలిబ్రేషనా?'అన్నారు.

అందరు గట్టిగా నవ్వారు. నేను కూడా శృతి కలపక తప్పలేదు.

ఆ తరువాత అక్కడున్నన్నాళ్ళు శ్రీపతిగారింటికి తరచుగా వెళ్ళేవాణ్ని, నిర్భయంగా ప్రతిరోజు ఏదోవొక ప్రోగ్రాంతో చాలా సరదాగా గడిచిపోయాయి అక్కడ వున్నన్ని రోజులు.

నే నా ప్రదేశంనుంచి వచ్చిన తరువాత సంవత్సరానికి అనుకుంటాను, సునీతకు పెళ్ళయిందని తెలిసింది. ఇప్పుడా దంపతులెక్కడున్నారో కాని, సునీత భర్తకు మాత్రం జీవితం 'బోర్' అనిపించదని నా నమ్మకం' అని ముగించాడు శర్మ. ●



# ఫోస్ఫోమిన్, శక్తిని పెంపొం



# దించును, ఆకలిని



# అధికముచే యును,

# సహనశక్తిని





# హెచ్చించు

# -ను. శరీము యొక్క

# రోగనిరోధక శక్తిని

# ఎక్కువచేయును




అవును —
కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్. బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేటుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

SQUIBB® TTT® ® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్, ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు చిహ్నం; దీని లైసెన్సుడు ఉపయోగదారులు సారాభాయ్ కెమికల్స్ ప్రయివేట్ లిమిటెడ్.

SARABHAI CHEMICALS

shilpi sc 49/67 Tel

## జరిగినకథ

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన పూర్తిగా మారిపోతుంది. అతని అక్కయ్య జ్యోతికి ఆనందరావుతో వివాహమవుతుంది. ప్రాణస్నేహితు లయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసు కుంటారు. రమణ భర్త వెంకట్రావు. పార్టీ రాజకీయాలతో విరోధివర్గాలయిన కుటుంబాలు వాళ్లవి. సెలవుల నెపంమీద వేణు సుశీలను చూడ్డానికి జ్యోతి యింటికి వెళ్తుంటాడు. వేణు సుశీలను వివాహం చేసుకుంటానని వాగ్దానం చేస్తాడు. కాలేజీలో వేణుకు ఉషతో పరిచయ మవుతుంది. జ్యోతి సుశీలను గురించి ఉత్తరం రాసి వేణుకు కర్తవ్యాన్ని జ్ఞాపకం చేస్తుంది. పార్టీ రాజకీయాలకు ఆనందరావు బలైపోతాడు. సుశీల వరదరాజు కూతురని తెలుసుకున్న వేణు వివాహానికి నిరాకరిస్తాడు. శంకరం మాస్టారు అతనికి నచ్చ చెప్పడానికి వెళ్తారు.

సీరియల్

తేజోవతి

# 25

'వేణూ !... నీకోసం ఎవరో వచ్చారు చూడు.' అని రాజా అనగానే, దీక్షగా తల వంచుకుని చదువుకుంటున్న వేణు, తిరిగి చూచాడు...అతడికి ఓక్షణం నోటంట మాట రాలేదు ... ఆ తర్వాత తొట్రుపడుతూ లేచి,

'రండి...మేష్టారూ ! రండి...' అంటూ ఆహ్వానించారు.

'రండి, వరదరాజులుగారూ...' అంటూ తనకు వేణు చూపించిన కుర్చీని ఆయనకు యిచ్చి తను వేణు మంచంమీద కూర్చు న్నారు శంకరంగారు...

'రాజా!... మా శంకరం మేష్టారు...' అంటూ పరిచయం చేశాడు వేణు... 'నా రూమ్‌మేట్ అండీ...'

'అరె ! శంకరం మేష్టారా !...నమస్కార మండీ...' అంటూ కూర్చున్నవాడల్లా లేచి గౌరవ సంభ్రమాలతో నమస్కరించి, 'ఈ కుర్చీలో కూర్చోండి మేష్టారూ!...' అన్నాడు రాజా ... ఆతర్వాత బయటికివెళ్ళి మిత్రులందర్నీ పిల్చుకువచ్చాడు...ఫ్రాంక్లిన్ పరుగెత్తుకుంటూ వచ్చాడు మేష్టారు దగ్గరికి...మిగతా వాళ్ళుకూడా ఆయన్ని చూచి, నమస్కరించి వెళ్ళిపొయ్యారు...

'ఫ్రాంక్లిన్ !...ఈ ఫ్లాస్కులో కాఫీ పట్టుకురా...' అంటున్న వేణుతో 'యిప్పు డవన్నీ అక్కరలేదు...మేం కాఫీ టిఫిను తీసుకునే వచ్చాం...' అన్నారు శంకరంగారు.

'ఆఁ...కాఫీకేముంది మేష్టారూ!... మళ్ళీ తీసుకోవచ్చులెండి...' అంటూ ఫ్లాస్కు తీసుకుని వెళ్లాడు ఫ్రాంక్లిన్...

వేణు గుండెల్లో రైళ్లు పరుగెడు తున్నయి ... చుక్క తెగిపడ్డట్టు మేష్టారు రావడమే ఓ చిత్రం !...దానికితోడు యీ వరదరాజుల్ని వెంటబెట్టుకు వచ్చేసరికి వేణుకు భయంగానేవుంది...దానికి తోడు వేణును చిత్రవధ చేస్తున్నది ఆయన ముభావం, గంభీరత...చివరకి తను కాఫీ కొడుతున్నప్పుడు పట్టుకున్నప్పుడు గూడా ఆయన మొఖాన ఆ చిరునవ్వు వుండనే వుంది...మేష్టారు ఒక్కసారి ఆయనకు సహజమైన చిరునవ్వు నవ్వితే చాలు గుండెల మీద భారం దిగిపోతుంది అనుకున్నాడు వేణు...

'చదువెలా సాగుతోంది?' శంకరంగారి ప్రశ్న

'యూనివర్సిటీ ఫస్టు మీ స్టూడెంటుకేనని మా ప్రొఫెసరుగారు ఎప్పుడో చెప్పేశారు. మేష్టారూ !...' అన్నాడు రాజా.

'నీతో కొంచెం మాట్లాడిపోదామని వచ్చాం.'

'అలాగే మేష్టారూ ... ఆ చెట్టుకింద కూచుందాం పదండి...' అంటూ లేవాడే గానీ వేణు గుండెలు వేగంగా కొట్టుకుంటు న్నాయి...ఇది శంకరంగారికి తెలిస్తే, ఆయన తన్ను కోప్పడతారేమోనని ముందే భయ పడ్డాడు వేణు...కానీ, ఆ వరదరాజులుకు మేష్టరంటే పడేగిట్టదు...ఇక యీ విషయం ఆయన చెవికెలా పోతుంది?... మహా అయితే అక్కచేత వుత్తరం వ్రాయి స్తాడేమో. అక్కకు తనెలాగైనా సమా ధానం చెప్పుకోగలననుకుని ధైర్యం తెచ్చు కున్నాడు...కానీ యివ్వాళ వీళ్లిద్దరూ రావడంతో, అవసర మొచ్చింది కాబట్టి, తను అంతద్రోహం తలపెట్టిన శంకరం గారి కాళ్లే మళ్లీ పట్టుకున్నాడన్న మాట !... ఇక యీ వరదరాజులు చెయ్యలేని దేమిటి ? !... అనుకుంటూ నిర్జనంగా వున్న ఓ ప్రదేశానికి తీసుకు వెళ్లాడు...అక్కడ ఓ చెట్టునీడన కూర్చు న్నారు ముగ్గురూ...

'వీరి అమ్మాయి సుశీలకూ నీకూ పరిచయముందిటగా?...' శంకరంగారు కూర్చుంటూనే అసలు విషయం ప్రస్తా వించారు.

వాళ్ళిద్దర్నీ చూడగానే సగంసగం వూహించుకున్న వేణు, తను చెప్పవలసిన విధంకూడా ముందే ఆలోచించి పెట్టేసు కున్నాడు...

'సుశీల యీయన కూతురుగా నాకు పరిచయం కాలేదు మేష్టారూ ... అలా అని తెలిసుంటే ఆ అమ్మాయివైపు కనీసం కన్నెత్తి అయినా చూచేవాడిని కాను మేష్టారూ.'

'ఆ అమ్మాయి ఎవరి కూతురేకానీ, స్నేహం చెయ్యడం, వివాహం చేసుకుంటా నని మాట యివ్వడం నిజమా అబద్ధమా అని అడుగుతున్నాను.'

'నిజమే మేష్టారూ...', వేణు వంచిన తల ఎత్తకుండానే ఒప్పుకున్నాడు... మేష్టా రితో యిలా మాట్లాడవలసి వచ్చినందుకు అతడికి చాలా బాధగావుంది.

'మాట యిచ్చినవాడివి మీ అమ్మాయికి వేరే సంబంధం చూసుకొమ్మని వుత్తరంలో వ్రాయడంలో అర్థమేమిటి ?'

'మేష్టారూ !...ఈయన్ని గురించి మీకు తెలియందీ, నేను చెప్పాలిసిందీ, ఏమీలేదు. నేను రౌడీనని ప్రచారం చేసిందీ, తన కిష్టులైనవారు కాపీకొడుతుంటే చూడనట్లే నటించి, నన్నుమాత్రం పట్టుకొని,అదేమిపని

అని నేను నిలేస్తే నన్ను ఆ స్కూల్‌నుండి పంపించేదాకా నిద్రపోందీ, నన్ను బాగు చెయ్యాలని మీరు ప్రయత్నం చేస్తున్నా వోర్చలేక పనిగట్టుకు మీయింటికి వచ్చి మీకు చెప్పిన మాటలు నా చెవులారా నేను విన్నాను ... ఇవన్నీ నేను మర్చిపోగలనా మేష్టారూ! ... నన్నేమీ చెయ్యలేక మీమీద కక్షగట్టి మిమ్మల్ని ఎన్నితిప్పలు పెట్టిందీ, యింకా ఎన్నికష్టాలు పెట్టాలని ప్రయత్నించిందీ, మీకు తెలియనివిగూడా నాకు తెలుసు ... అనవసరంగా మిమ్మల్ని రచ్చకీడ్చి పోలీసుల ఎదుట నిలబెట్టిందీ యీయనే... ఆఖరికి తన కొడుకు చేసిన/ దొంగతనం నాకంటగట్టి నన్ను అవమానంపాలు చెయ్యాలని ప్రయత్నించిందీ యీయనే...నన్ను నాశనం చెయ్యాలని సమకట్టిన యీయన్ని మామగారి స్థానంలో గౌరవించమని మీరు సలహాయిస్తున్నారా మేష్టారూ? ... పగవారికి కూడా మేలుకోరుతారే మీరు...అటువంటిది మీ బాబు, రఘుబాబు చావు బతుకుల్లో వుంటే, కనీసం అప్పుయివ్వడానికి కూడా ప్రాణం ఒప్పని యీయన కూతుర్ని పెళ్లి చేసుకోమని మీరు సలహాయిస్తారా మేష్టారూ?' వేణు గద్గదమైన కంఠంతో ఆవేశంగా అడిగాడు...

'వేణూ !...చిన్నప్పటినుండీ నిన్ను అభిమానించలేక పొయ్యాను...నిజమే...నిన్ను సరిదిద్దడానికి ప్రయత్నించడానికి బదులు, నీమీద కక్షగట్టినమాటా నిజమే ... ఈ శంకరం పెద్దమనసును అర్థం చేసుకోలేక, అతడిమీద అనవసరంగా ద్వేషం పెంచుకున్న మాటా నిజమే...ఆరోజు నువ్వు స్వయంగా విన్నావని తెలియక, యీయనే పురికొల్పాడని అనవసరంగా భ్రమపడ్డాను...ఆ భ్రమతోనే ఆయనమీద కక్ష సాధించాను...కానీ ఒక్కటి మాత్రం నిజం వేణూ!... నువ్వు వృద్ధిలోకి రావాలని కోరుకోక పోవచ్చుకానీ...నువ్వు నాశనమై పోవాలనిమాత్రం ఏనాడూ కోరుకోలేదు వేణూ.. నిజం...ఏమేష్టారూ అలా కోరుకోడు కూడా...' అంటూ, డగ్గుత్తికతో, పశ్చాత్తాపంతో మిళితమైన సంజాయిషీ యిచ్చుకున్నారు వరదరాజులుగారు.

'నాకు మీతో మాట్లాడాల్సిన అవసరం లేదు వరదరాజులుగారూ ... మా మేష్టారు అడిగినవాటికే నేను సంజాయిషీ చెప్పుకుంటున్నాను...' ముఖం మరోప్రక్కకు తిప్పుకున్నాడు వేణు.

'వేణూ!...ఎప్పుడో ఏదో జరిగిందని దాన్ని పట్టుకునే కూర్చుంటామా...పరిస్థితుల ప్రాబల్యమో, లేక యితరుల మాటలవల్లనో ఆయన ఒకసారి నన్ను పొరబాటుగా అర్థం చేసుకున్నారని, అపకారం తలపెట్టారనీ, యిక ఆ భావమే కలకాలం వుంటుందని ఎందుకనుకోవాలి?... ఒకవేళ వున్నదే అనుకుందాం ... 'అపకారికి కూడా వుపకారం చెయ్యమన్నారు మన పెద్దలు.. ఒకరు అపకారం చేశారని నేనూ అపకారం చేస్తానంటే యిక నీ వ్యక్తిత్వంలో వున్న గొప్పతనం ఏముంది?.'

శంకరంగారు ముభావంవదిలి, చిరునవ్వుతో నచ్చచెప్పారు...ఆయన చిరునవ్వు చూశాక కాస్త ధైర్యం వచ్చింది వేణుకు .. 'నాలో అంతటి వుదాత్తత లేదు మేష్టారూ ...నేను సామాన్యవ్యక్తిని ... మంచికిమంచి, చెడుకుచెడు... ఇదే నా స్వభావం...అదీగాక



# ఘోరాం సంధ్యా ప్రవర్తతే..

అప్పుడప్పుడే అభిప్రాయాలంటూ ఏర్పడుతున్న వయసులో నాకు యీాయనంటే ద్వేషం, అసహ్యం కలిగింది ... మీకు నేను చెప్పతగ్గవాడిని కాను... కానీ బాగా నాటుకుపోయిన ఆ అభిప్రాయం యివ్వాళ పొమ్మంటే పోతుందా మేష్టారూ?'

వేణు మాటలు వింటుంటే వరదరాజులుగారికి దిగులుతోబాటు ఆశ్చర్యం కూడా కలుగుతోంది...వేణు తలపొగరువాడన్నదొక్కటే ఆయనకు తెలుసు. శంకరంగారి దగ్గర యింత నమ్రత చూపుతాడని ఆయనకు తెలియదు. తనూ అన్నాళ్ళు చదువు చెప్పాడే వేణుకు! ... కానీ తను సంపాదించగలిగిందేమిటి?...అగౌరవం! అపహాసం! ... కానీ యీ శంకరం ! ... చదువు చెప్పింది ఆరునెల్లు! ... సంపాదించింది!...గౌరవం!...మితిలేని గౌరవం!... అభిమానం !...అవును ! ఆధ్యాపకుడు, విద్యార్థులనుండి సంపాదించుకోవలసింది ఏమిటో, అది సంపాదించడం ఎలా సాధ్యపడుతుందో...యిప్పుడిప్పుడే ఆయన కవగతమవుతోంది !

'సరే...ఆ విషయమలా వుంచు వేణూ ! ... సుశీలను పెళ్ళిచేసుకుంటానని మాటయిచ్చావంటే, ఆ అమ్మాయి గుణగణాలు నీకు నచ్చేకదా ? ...' శంకరంగారు మరో పాయింటు తీశారు.

'ఆ...అప్పట్లో ఆ అమ్మాయి గుణం మంచిదే మేష్టారు...'

ఆ జవాబువిని శంకరంగారు మనసులోనే నవ్వుకున్నారు...'అంటే యీాయన దగ్గరకు వచ్చాక ఆ అమ్మాయి గుణం మారిపోతుందనా యితడి భయం ?' అనుకొని... 'నువ్వు తాళిగట్టేది సుశీలకు...ఇక ఆ పిల్ల తల్లిదండ్రుల మంచిచెడులతో నీకేంపని ?' అని అడిగారు.

'మేష్టారూ...పెళ్ళంటే ఒకరోజు రెండురోజుల బాంధవ్యం కాదుగదా...రెండు జీవితాలమధ్య, రెండు కుటుంబాలమధ్య శాశ్వతంగా ఏర్పడే సంబంధం ... ఇవ్వాళ తాళి కట్టేసి రేపటినుండీ, ఆ కుటుంబమంటే అసలే సద్భావం లేనందువల్ల, అసంతృప్తిని పెంచుకుంటూ జీవితం గడపమంటారా మేష్టారూ ? ... ఇంకొక విషయంకూడా మేష్టారూ ... మీకు వ్రాయాలనుకుంటూనే వున్నాను...మీ దగ్గర నాకు దాపరికంలేదు... ప్రొఫెసరు చంద్రశేఖరంగారి అమ్మాయి ఉష నన్ను ప్రేమించింది... ఆయనకూడా నన్ను అల్లుడ్ని చేసుకోవాలనీ, మమ్మల్నిద్దరినీ చదువుకోసం ఫారన్ పంపించాలనీ, నన్ను వృద్ధిలోకి తేవాలనీ అభిప్రాయం వుంది ... మీ రొకసారి ఆశీర్వదించారు. మేష్టారూ!... 'కష్టపడి బాగా చదివి వృద్ధిలోకి రావాలని, ఫారన్‌కూడా వెళ్ళాలని' ఆశీర్వదించారు !... మీ ఆశీర్వాదం ఫలించి నన్ను చక్కటి భవిష్యత్తు పిలుస్తుంటే, ఒకానొకప్పుడు నన్ను ఏవిధంగా త్రొక్కెయ్యాలా అని ప్రయత్నించిన యీాయనతో వియ్యం కలుపుకోమంటారా మేష్టారూ?...'...వేణుమాటల్లో నమ్రతవున్నా, తన భవిష్యత్తు పాడుచేసుకోమనరులే.. అన్న ధీమాకూడా వుంది...

కానీ శంకరంగారు మాత్రం చిత్రంగా మారిపొయ్యారు. ఆయన ముఖం ఎర్రబడింది...కళ్ళు క్రోధారుణ జ్వాలలు చిమ్ముతున్నాయి...'అయితే – నువ్వు ప్రేమించేదీ, పెళ్ళాడేదీ, ఆ పిల్ల గుణగణాలూ, రూపురేఖలూ చూసి కాదన్నమాట! ... ఆ పిల్ల తల్లిదండ్రుల్ని చూసి చేసుకుంటావన్నమాట ! ... మరి ఇంతసేపూ నిందంతా ఆయనమీద వేసింది కేవలం తప్పుకోడానికేనా ?...' అంటుంటే ఆయన మాటలు ఒక్కొక్కటి శూలంలా వేణు గుండెల్లో గుచ్చుకుంది.

'లేదు...మేష్టారూ...లేదు...సుశీల యీాయన కూతురని తెలిసేదాకా, నేను ఆ అమ్మాయి ఆకర్షణనుంచి దూరంగానే వున్నాను ... ఎలాంటి ప్రలోభాలకు లొంగిపోలేదు మేష్టారూ ... చివరికి వాళ్ళ కుటుంబంతో కలిసి ఉత్తర హిందూస్థానమంతా తిరిగి వచ్చినప్పుడుకూడా, నేను ఏ రోజూ హద్దులు దాటలేదు మేష్టారూ ... నిజం ... నా మాట నమ్మండి మేష్టారూ ! ... నేను ప్రమాణంచేసి చెబుతున్నాను...' వేణుకంఠం రుద్ధమైంది. మేష్టారు తనను నీచంగా భావిస్తున్నందుకు అతడు చాలా బాధపడుతున్నాడు.

'సరే...ఆపిల్ల తండ్రంటే నీకుసద్భావం లేదు గనుక, యిచ్చిన మాట తప్పి ఆ అమ్మాయి జీవితాన్ని నాశనం చేస్తున్నానన్నావు...సరే బాగుంది...ఇప్పుడా అమ్మాయి గతి ?...'

వేణు క్షణం తటపటాయించాడు ... చివరికి మెల్లిగా,...'వాళ్ళ నాన్నగారున్నారుగా మేష్టారూ ! ... దొంగకానీ, రోషిగానీ కాని మంచి అల్లుణ్ని వెతుక్కొస్తారు క్షణంలో...అంతగా కట్నం కానుకలూయిచ్చి, సుశీలకు మంచి సంబంధం యీాయన తేలేని స్థితిలోవుంటే ... ఏ రెండువేలో, మూడువేలో నేనిస్తాను ... సుశీలకు మంచి సంబంధం చూసుకోమనండీ...'

'వేణూ ! !...'

పరిసరాలు దద్దరిల్లాయి ఆ అరుపుతో! ... వేణు చెంపకూడా 'ఛెళ్ళు' మన్నది ఆ శబ్దంలో కలిసిపోతూ...

'ఛీ !...నీచుడా ! ... నీ అంత నీచురాలు కాదు ఆ అమ్మాయి !...' మితిమీరిన ఆగ్రహంలో విలువెల్లా పలుకుతున్న శంకరంగారి



కంఠం కూడా వొణుకుతోంది ... 'వదండి వరదరాజులుగారూ!...' మూడవకన్ను తెరిచిన శంకరునిలా బయలుదేరిన శంకరంగారిని, 'మేషారూ!...' అని పిల్చాడు వేణు కందిపోయిన చెంపను చేత్తో పట్టుకుని కృంగిపోయిన స్వరంతో...

'ఛీ! ఇకనుండీ నన్నలా పిలవకు!...' వెనక్కు తిరక్కుండానే చెప్పేసి క్షణంలో కను మరుగయ్యారు శంకరంగారు... '

కళ్ళనిండా కమ్మిన నీళ్ళు ముందుకు చూడనివ్వక పోయినా, రాతిలా అలాగే ఆయన వెళ్ళినవైపు చూస్తూ కూర్చున్నాడు వేణు ఆలోచిస్తూ...

* * *

'ఏమండీ!...ఏమైంది?..!. వేణు ఏదు

# పూర్వసంధ్యా ప్రవర్తతే...

వ్వాడు ?...' రిక్షాదిగి లోపలకు వస్తుండగానే ప్రశ్నించింది పార్వతి, పంచలోనే ఎదురయి...

'ఇక ఆతడిపేరు నా దగ్గర ఎత్తకు...' శాసించినట్లుగా అని, వెంటవున్న వరదరాజులుగారికి ఓ కుర్చీయిచ్చి, తనో కుర్చీలోకి వాలిపొయ్యారు శంకరంగారు వుస్సు అంటూ...

'ఏం ?...ఏమన్నాడు ?...చేసుకో నన్నాడా ?...' ఆదుర్దాగా అడుగుతున్న పార్వతికి సవిస్తరంగా జరిగిందంతా చెప్పారు వరదరాజులుగారు...

వరదరాజులుగారు యీ మధ్య కష్టాలకు బాగా అలవాటుపడి పొయ్యారు... కొందరి జీవితాలు ఆశించిన వాటికి పూర్తిగా విరుద్ధంగా జరుగుతుంటయి...అదేంపాపమో జీవితంలో వాళ్లనుకున్నవి తప్ప అన్నీ జరుగుతుంటయి...వరదరాజులుగారు డాక్టరవాలనుకున్నాడు...ఆయన కిష్టంలేకుండానే మేష్టరయ్యాడు...కనీసం ఆస్తినైనా ఆర్జించుదామనుకున్నాడు...కానీ అదీ మిగల్లేదు... కొడుకునైనా డాక్టరు చేద్దామనుకున్నాడు ...వాడూ ఆవిధంగా తయారయ్యాడు... కనీసం తన కూతురు, అదృష్టం కొద్దీ తన కడుపునపుట్టిన తన కూతురైనా అది కోరిన సంబంధంచేసి, వాళ్లు చిలకా గోరింకల్లా వుంటేనన్నా చూసి తన దిగుళ్లు మర్చిపోదామనుకున్నాడు ... అదీ ఎదురు తిరిగింది... ఈ శంకరం తనకంటె ఎందులో గొప్ప ? ... ఇతన్ని తన కాళ్ళదగ్గరకు పిలిపించుకోవాలి అనుకున్నాడు ... చివరికి తనే అతడిచుట్టూ తిరగవలసి వచ్చింది ! ... రోజు రోజుకూ శంకరంగారి ఋణం పెరిగిపోతోంది కానీ తరగటంలేదు...ఒక్కోసారి... 'నేను నిన్ను ఎన్నో తిప్పలు పెట్టాను... ఆ పాపఫలం అనుభవిస్తున్నాను...నువ్వు నాకు సాయం చేసేకొద్దీ నా తల మరీ వంగిపోతోంది...' అని శంకరంగారి చేతులు పట్టుకుని అనాలని అనుకుంటున్నాడు... కాని అభిమానం అడ్డొచ్చి అడగనివ్వటం లేదు ..నిండా మునిగినవాళ్లకు చలేమిటి? అన్న ధోరణిలో పడ్డారిప్పుడాయన...

వరదరాజులుగారు చెప్పింది విని పార్వతి నిట్టూర్చింది...భర్తవైపు తిరిగి, 'మీరు తప్పుచేశారండీ! ... తన అభిప్రాయం సబబవునో కాదో, తండ్రిమీద కోపంతో, అమాయకురాలు సుశీల జీవితం నాశనం చెయ్యడం న్యాయమేనో బాగా ఆలోచించుకోమని...మీరు నచ్చ చెపితే అతడు తప్పక ఆలోచించేవాడు...మీరు మీ కోపంకొద్దీ చెయ్యి చేసుకు చక్కావస్తే, అతడి అభిప్రాయాలు తప్పని అతడు తెల్సుకోగల్గుతాడా?...' అంది...

'అది కాదు పార్వతీ!...ఆ అమ్మాయిని గురించి అతడంత చులకనగా మాట్లాడే సరికి నేను నిగ్రహించుకోలేకపొయ్యాను... కావాలంటే కట్నమిస్తాడట!...వేరే సంబంధం వెతుక్కోమన్నాడు...ఇది వింటే ఆపిల్ల ఎంత బాధపడుతుంది!.. అతడిమీద నమ్మకంతో యిన్నాళ్లు యిలా వేచివుందే?.. ఇంత నమ్మకద్రోహం చేశాడని తెలిస్తే, ఆ అమ్మాయి యీ పిడుగుపాటు తట్టుకోగలదా?...నా మీద కొండంత నమ్మకం పెట్టుకుందే ... ఇప్పుడు అమ్మాయికి ఏం సమాధానం చెప్పగలను!...' అని శంకరంగారు మధనపడుతుంటే, పార్వతికి అప్పటిగ్గానీ గుర్తు రాలేదు, వీళ్లు వచ్చారో లేదో కనుక్కుందామని వచ్చిన సుశీల యింట్లోనే వుందన్న సంగతి!...

లోపల ఎక్కడుందో, యీ మాటలేమన్నా చెవిన పడ్డాయేమోనని కంగారుపడుతూ లేచిన పార్వతి, లోపలివైపు తలుపు నానుకుని, స్థాణువులా నిలబడ్డ సుశీలను చూచి, 'ఏమ్మా!...ఎందుకిలా నిలబడ్డావ్?' అంది కంగారుగా...

సుశీల జవాబు చెప్పే స్థితిలోలేదు...తన వాడనుకున్న బావ తన కిలా ద్రోహం చేస్తాడా?...నమ్మించి మోసం చేస్తాడా?... తన తండ్రి ఏదో చేశాడని తనమీద కక్ష సాధిస్తాడా? ... తను ఎంతగా నమ్మింది బావను...నీళ్లు నిండిన్న కళ్లతో శూన్యంలోకి చూస్తూ నిలుచున్న సుశీలను చూడగానే ... పార్వతికి భయం వేసింది ... వరదరాజులుగారి గుండెలు దడదడలాడినయి ...కనీసం యీ బిడ్డనైనా నాకు దక్కనివ్వవా భగవాన్!...ఇంకా ఎంతో అనుభవించాలి నేను! ... అనుకుంటున్నారాయన...

నమ్మినవాళ్లు ద్రోహం చేసి, ఆశలు పాతాళంలోకి పడిపోయి, జీవితం భయంకరంగా మారి భయపెడుతున్నప్పుడు, యీ అమాయకురాలి మనసులో ఏ భయంకరమైన ఊహలు చెలరేగుతున్నయ్యో భగవాన్!...అనుకుని భయపడ్డారు శంకరంగారు...

'శంకరం! ... నువ్వు నా బిడ్డను నాకు దక్కించాలి శంకరం!.. 'శంకరంగారి రెండు చేతులూ పట్టుకున్నారు వరదరాజులుగారు... లోతుకుపోయిన ఆయన కళ్లల్లోంచి కన్నీరు బొట్లు బొట్లుగా కారుతోంది... 'ఒక్క నాలుగురోజులు అమ్మాయిని మీ యింట్లో వుంచుకుని కాస్త ధైర్యం చెప్పండి.. ఏదే అఘాయిత్యమూ తలపెట్టకుండా కాస్త కనిపెట్టివుండండి...నా జీవితంఅంతా నాకు ఎదురుతిరిగింది.. ఇంకా యీ బిడ్డకూడా దూరం కాకుండా కాస్త సాయంచేసి పెట్టు శంకరం!' అంటూ ప్రాధేయపడ్డారు వరదరాజులుగారు...ఆయన గత రెండు మూడేళ్లుగా మరీ ముసలిరూపు వడిపొయ్యారు. కష్టాలూ, వార్ధక్యమూ రెండూ పోటీ వేసుకుని ఆయన్ను చుట్టు ముడుతున్నాయేమో నన్నట్టున్నారాయన...

ముడతలుపడ్డ బుగ్గల్లోంచి జారుతున్న కన్నీళ్లు చూడగానే శంకరంగారి మనసు కరిగిపోయింది...'మీకేం ఫర్వాలేదు.. సుశీలను ఇక్కడే వుంచుకుంటాం...పార్వతి కంటికి రెప్పలా కాచుకుంటుంది... మీరు దిగులు పడకండి...' అని ధైర్యం చెప్పారాయన...

సుశీల ఒకసారి అందరివైపూ చూసి, నిర్లిప్తంగా నవ్వింది!... ఆ నవ్వు చూసి వరదరాజులుగారి గుండెలవిసిపోయినయి...

* * *

ప్రకృతి చీకటి దుప్పటి సిద్ధం చేసుకుంటోంది అప్పుడప్పుడే...ఊరు చాలా వరకూ మాటు మణిగింది ... రంగడు ఓ మూల గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు... రంగడిప్పుడు పక్క వూళ్ళో వున్న హైస్కూల్లో చదువుకుంటున్నాడు...ఎంత లేదన్నా రోజుకు ఏడెనిమిదిమైళ్లు నడవాల్సివస్తోంది వుదయం సాయంత్రం కలిసి... ఇంకోవైపు నరసమ్మగారు మంచి నిద్రలో వుంది...తోడుగా పడుకుంటున్న వెంకన్న వాకిటిముందు పడుకుని అప్పుడే గురక పెడుతున్నాడు కడుపులోని పసిపాప కిలకిలకు మనస్సు గతంలోకి పరు

గెత్తగా, గత స్మృతులను జ్ఞాపకం చేసుకుంటూ, అలాగే ఆలోచిస్తూ పడుకుంది జ్యోతి...

'టక్!. టక్!...'

దొడ్డి తలుపు ఎవరో కొడుతున్నట్లుగా వుంది.. జ్యోతి ముందు భయపడింది...నరసమ్మగారినిగానీ, పాలేరునుగానీ లేపుదామనుకుంది ... కానీ యిక తనకేమిఃభయం! జీవితంలో ఏంవొచ్చినా భరించడానికి తను సిద్ధంగానేవుంది! అనుకుంటూ ఓ నిర్లిప్తతతో కూడిన ధైర్యం రాగా లేచివెళ్లి దొడ్డి తలుపు తీసింది...నిండా ముసుగు కప్పుకున్న ఓ ఆకారం లోపలికి ప్రవేశించింది తలుపు తోసుకుని...లోపల కొచ్చి తలుపు గడియపెట్టి ముసుగు తీసేసింది...

'రవణా...' అంటూ ఒక్కసారిగా కౌగలించుకుంది జ్యోతి...

రెండు మూడు నిముషాలదాకా ఎవ్వరూ మాట్లాడలేదు ... ఆ తర్వాత జ్యోతి కళ్ల నుండి ప్రవహిస్తున్న అశ్రుధారను తుడుస్తూ, 'జ్యోతి!... నీ పసుపుకుంకుమ తుడిచివేసిన యీ ఘాతుకురాలిమీద, యింకా కౌగిలించుకునేంత అభిమానం చూపిస్తున్నావా జ్యోతీ!...వద్దు జ్యోతీ!... నేను నీ స్నేహానికి తగను...నన్ను శిక్షించు జ్యోతీ! ... నా కేదన్నా శిక్ష విధించు...' అంటూ జ్యోతి భుజంమీద తలపెట్టుకుని ఏడ్చింది రవణ...

'అదేంటి రవణా!... నువ్వేంచేశావ్?... ఇందులో నువు చేసిందేముంగి రవణా ?!' అంది జ్యోతి రవణను ఓదారుస్తూ...

'ఒకసారి నువ్వు నా పసుపుకుంకుమను కాపాడావ్ ... నాకు తెలుసు జ్యోతీ, నువు క్షమిస్తావని...అందుకే ధైర్యంచేసి వచ్చాను. ...మూడునెలలనుండీ రావాలనే అనుకుంటున్నాను...కానీ మా యింట్లోనుండి కదిలిరావడానికి వీల్లేకపోతోంది... నా మీద నిఘా వేసివుంచారు జ్యోతి ... గడప దాటకుండా ... ఇవ్వాళ్టికి వీలయింది ... అందరి కళ్లల్లో కారం కొట్టిరావడానికి...అయినా — ఎందుకిలా జరగనిచ్చావ్ జ్యోతీ!...నేను రాసిన చీటీ యివ్వలేదా ఆ అమ్మి?'...

'చీటీ అందింది రవణా!...కానీ...అలా జరగవలసివుంది జరిగిపోయింది... అంతే... ఇంక ఎందుకని చెప్పగలను? అంటూ ఆ రోజు రాత్రి భర్తతో జరిగిన సంభాషణ అంతా వూసగుచ్చినట్లు చెప్పింది జ్యోతి స్నేహితురాలితో... (ఇంకా వుంది)



■ 'నే నొప్పుకోను' అంది శ్రీలక్ష్మి. ఆమె కంఠంలోని తీవ్రతకు మిగిలిన ముగ్గురూ ఉలిక్కిపడ్డారు.

'అదేం వదినా, అలా అనేశావ్ ఒక్క మాటతోనూ?' అంది సరళ అమాయకంగా. ప్రకాశం, మూర్తి ప్రశ్నార్థకంగా శ్రీలక్ష్మి వేపు చూశారు. అందరి చూపులూ తనమీద కేంద్రీకరింపబడటం చూసి శ్రీలక్ష్మి కొద్దిగా సిగ్గుపడింది.

ఆ ఊళ్లోనే ఉంటున్న సరళ అన్నా వదినలను చూసిపోవటానికి భర్తతో కలిసి వచ్చిందవాళ. భోజనాలయ్యాక తాంబూలం వేసుకుంటూ తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటున్నారు. అప్పుడే సరళ తను చదివిన కథ గురించి చెప్పింది.

ఆ కథలో నాయిక గుణవతి, చాలా నెమ్మదయిన పిల్ల. కాని కురూపి. ఎంత కాలానికి పెళ్లికాదామెకు. మొదటి నుండి ఆమెకు తెలిసిన వ్యక్తి, ఆమె ఉనికిని మరో విధంగా గుర్తించని వ్యక్తి, నీతి నియమాల్ని లెక్కచెయ్యని వాడు ఆఖర్లో ఆమె చేత ఆకర్షింపబడి 'నిన్ను పెళ్లిచేసుకుంటా' అంటాడు. అదీ కథ. అప్పటికైనా కథానాయికను అతను గుర్తించినందుకు సంతోషించింది సరళ. ఆ కథను ఎంతగానో పొగిడింది. కాని శ్రీలక్ష్మి 'నేనొప్పుకోను' అనగానే తెల్లబోయింది.

ఎంత అణచుకున్నా ఆగని ఆవేశంతో శ్రీలక్ష్మి పెదవులు కొద్దిగా వణికాయి. తన్నుతాను సంబాళించుకుంటూ,

'కురూపే కావచ్చును. కాని నైతికంగా దిగజారని స్త్రీ. అల్లా పతనం చెందిన వ్యక్తి ఆమెకు తగడు' అంది.

సరళ ఆశ్చర్యంతో 'కాని...అతను... అతను మగవాడు' అంది

'అయితే? మగవాడికి మాత్రం ఆడదాని కుండాలంటారే అలాంటి పరిశుద్ధమయిన శీలం ఉండక్కర్లేదంటారా? ఏమో నేనలా అనుకోను,'

'కాని, మన సంఘంలో...'

సంఘంలో జరుగుతున్నదాన్ని గురించి నేను చెప్పటంలేదు. ఆడదాని మనస్సు గురించి చెబుతున్నా. కురూపి అయినంత మాత్రాన శీలవతి అయిన ఆమె, ఎంతో మంది ఆడవాళ్లతో సంపర్కం పెట్టుకున్నాడని నమ్మకంగా తెలిసికూడా అతన్నెలా స్వీకరించగలదు? ఇక పెళ్లికాదేమోనన్న ఆరాటంతో అలాటివాడిని ఆ అమ్మాయి చేసుకుని ఉండాలి కాని, తెలిసీతెలిసీ ఏమాత్రం మచ్చలేని ఆడది అలాటి మగవాడిని మనసా వరించటం అసంభవం' శ్రీలక్ష్మి వీలయినంత నెమ్మదిగానే చెప్పినా అందులోని తీవ్రత వారందర్నీ కదలించక మానలేదు

'అయితే అక్కగారూ, మీ అభిప్రాయంలో కాలుజారిన ఆడదానికీ, మగవాడికీ తేడానే లేదంటారు. అంతేనా?' అన్నాడు మూర్తి.

'నేననటంకాదు. నిజానికి అలా ఉండక పోవటమే న్యాయం. మీరే ఆలోచించండి. కాలుజారిన ఆడదానికీ, మగవాడికీ ఏమిటి తేడా? ప్రకృతి ఆడదానిమీద ఓ ముద్రను వేస్తుంది. మగవాడుమాత్రం తప్పించుకు పోతాడు. సంఘంలోనూ ఇలాగే జరుగుతోంది. కాలు జారిన అమ్మాయిని పతిత అని దూషించి వెలివేసినట్టుగా ప్రవర్తిస్తారు. కాని ఆమెతో ఆ శిక్షలో పాలుపంచుకోవాల్సిన మగవాడు రాజాంరోషంగా తిరుగుతుంటాడు— మగమహారాజాగనుక—శిక్షిస్తే ఇద్దర్నీ శిక్షించాలి. లేదా ఇద్దర్నీ చూసీచూడనట్టు వది

వెయ్యాలి. జీవనంలో సమానంగా పాలుపంచుకున్న ఇద్దర్నీ ఒక్కలా చూడటం న్యాయమనిపించు కుంటుంది.'

'నిజమే. కాని నువ్వేమంటావ్ ప్రకాశం? అక్కగారితో ఏకీభవిస్తావను కుంటా నే?' అన్నాడు మూర్తి.

'ఆఁ ... అవును మరి' అంటూ మళ్లీ మౌనం వహించాడు ప్రకాశం భర్త అవుననటంతో పుంజుకుని శ్రీలక్ష్మి మళ్లీ అంది.

'ఏ అమ్మాయి అలా కాలుజారిన వ్యక్తిని పెళ్లిచేసుకోవాలని కిష్టపడదు. విధిలేక అలాచేసుకున్నా స్త్రీ తన అంతర్యంలో అలాంటి పురుషుణ్ణి అసహ్యించుకుంటుంది. నైతికంగా పతనమైన మగవాడిని ఆడది ఎలా గౌరవించగలదు?'

'అవు నొదినా, నువ్వన్నదీ నిజమేననిపిస్తోంది' అంది సరళ ఆలోచనగా.

ఆసంభాషణ అంతటితో ఆగిపోయింది.

* * *

ప్రకాశానికి శ్రీలక్ష్మితో పెళ్లయి అయిదేళ్ళు కావస్తోంది ఇన్సూరెన్సు కంపెనీలో ఉద్యోగమతనికి. అతని తల్లీ తండ్రీ పొలంపుట్రా చూసుకుంటూ పల్లెలోనే ఉంటున్నారు. ఉన్న ఒక్క చెల్లెలు సరళకూ పెళ్లయి పోవటంతో ఏ బాదర బందీలేదు. శ్రీలక్ష్మి, ప్రకాశమూ అప్పుడప్పుడూ పల్లెకు వెళ్లి తల్లిదండ్రుల్ని చూసుకుని వస్తుండేవారు. వారి కాపురం ఎంతో ప్రశాంతంగా సాఫీగా సాగిపోతోంది.

శ్రీలక్ష్మిలో కాస్త ఆవేశపుపాలు ఎక్కువ. ఆదర్శాలు కలలుకంటూ ఉండేది. ఇంతవరకు ఆమె అనుకున్నదేదీ కాకుండా పోలేదు. తల్లిదండ్రుల కొక్కతే కూతురవడం మూలాన్న గారాబంగా పెరిగినా వినయమూ, సౌశీల్యమూ ఆమెకు పెట్టని సొమ్ములుగా అమిరాయి. ప్రకాశంతో పెనవేసుకున్న ఆమె జీవితం నూతనోత్సాహంతో కలత లెరగకుండా సాఫీగా సాగిపోతోంది.

ప్రకాశం శాంతస్వభావి భార్యని అమితంగా ప్రేమించేవాడు. ఆవేశం ఓపాలు ఎక్కువైన శ్రీలక్ష్మిని ఈ అయిదేళ్లలో ఒక్కమారు కూడా నొప్పించలేదతను. ఆమె కోరికల్ని తీర్చటమే తన జీవిత ధ్యేయమేమోనన్నట్లు అతను ప్రవర్తించేవాడు.

శలవుల్లో పల్లెకు వెళ్లినప్పుడు మరింత సరదాగా గడిచిపోయేది వారికి. అత్తగారికీ, మామగారికీ శ్రీలక్ష్మి ఎంతో మక్కువ. ఆమె కడుపులో ఓ కాయి కాయ లేనన్న బెంగతప్ప మరేమీ లోటు లేదు వారికి.

'అమ్మాయొస్తే ఇల్లు కలకల్లాడుతోందిరా' అంటూ ముచ్చటపడేది శ్రీలక్ష్మి అత్తగారు. అక్కడున్నన్నాళ్లు వారికిష్టమైనవి వండి పెట్టేది. శ్రీలక్ష్మి 'అత్తయ్య, అత్తయ్య' అంటూ ఆమె వెంట పెట్టుకు తిరుగుతూ పనుల్లో సాయం చేస్తుంటే ఒహటే మురిసి పోయేదావిడ. ఇహ ప్రకాశం తండ్రి కుర్రాళ్లల్లో కుర్రాడై పోయేవాడు. 'ఏమ్రా రేపు తోటలో భోజనాలకేర్పాటు చేద్దామా? ఎల్లుండేమో...' అంటూ అందరికన్నా ముందుండేవాడు ఉత్సాహంతో. అదే సమయంలో సరళ, మూర్తి కూడా వచ్చేస్తే వాళ్ల ఆనందానికి పట్టపగ్గాలుండేవికావు. ప్రకాశమూ అంతే, ఆ తోటలకు ఎన్నిమార్లు శ్రీలక్ష్మిని తీసికెళ్లినా తృప్తి ఉండేది కాదతనికి.

రామన్న వాళ్లింటి పాలేరు. వాళ్ల తండ్రి తాతల కాలం నుండీ ఇంటిని అంటిపెట్టుకున్న కుటుంబం అతనిది.

'మా సినబాబుగా రిప్పుడిట్టా ఉన్నారుగానీండి. ఏం అల్లరిసేసేవోరు. ఏఅల్లరి సేసేవోరు.........' అనే వాడు రామన్న శ్రీలక్ష్మితో. ఆమె భర్తను క్రీగంటితో చూస్తూ,

'అలాగా రామన్నా, ఏం అల్లరిచేసేవారేమిటి?' అనేది కుతూహలంతో.

'అమ్మో! అదెట్టా, సదువులోపడ్డాక బుద్ధిమంతులయ్యారులెండి, ఏం చినబాబూ?' అనేవాడు రామన్న.

ఈ మారు శలవులకు పల్లెకు వెళ్లినప్పుడు రామన్న శ్రీలక్ష్మితో 'సిన్నమ్మగారు, ఓ మనవండి' అంటూ మొదలెట్టాడు.

'నాతోనే! ఏమిటది?'

'మరెండి. మా సెల్లికొడుకుని నూసారుగందా. ఇక్కడే తిరుగుతుండాడు. అన్నమానం—ఆడు సదువుకుంటానంటున్నాడమ్మగారూ.'

'మంచిదే. చదువుకోనియ్'

'మరేండమ్మగారూ, ఈడో బడి ఉండాదిగానీండి అందులో నాలుగు కళాసులూ సదివేశాడండి. మరో పుత్తకం గూడ పంతులుగారిదగ్గర సెప్పించుకున్నాడండి. పెదబాబుగారేమో పట్నం పంపించమన్నారండి. ఆరిక్కూడా రంగడంటే మా చెడ్డ ఇష్టంలెండి. తమ రెరుగుదురనుకుంటా, పట్నం సంగతి మాకేటితెలుస్తాది? రంగణ్ణి మీతో తీసికెళ్తే సాయంగా ఉంటాడండి సదూకుంటూను. ఎదో ఆశపడుతుండాడు తల్లిలేని బిడ్డోడూ.'

శ్రీలక్ష్మికి రంగడిమోహం కళ్లముందు మెదిలింది. చిలిపికళ్లు, చక్కటిమోహం! చిన్నపిల్లలెప్పుడూ ఉన్నా బాగానే ఉంటారు. అందులోను రంగడి మోహం మరింత ముద్దుగా ఉండేది. ఇప్పుడు కొంచం ఎదిగాడు. కాని మోహంలో ముగ్ధత్వం అలాగే నిలచిఉంది.

'అలాగేలె! పెదబాబుగారితో, అమ్మగారితో, చినబాబుగారితో అందరితోనూ చెప్పేయి.'

రంగడు వారితో రావటం ఖాయమయింది. 'ఎంటో గేదెలు కాసుకునుండమంటే ఇన్నాడు కాదు. బాగాసదువుకోరా పిల్లోడా' అని సాగనంపాడు రామన్న.

రంగడి రాకతో ఇంట్లో దినచర్యలో కొద్దిగా మార్పులొచ్చాయి. ప్రకాశం వాడిని బళ్ళో వేశాడు. రంగడు బుద్ధిగా చదువుకుంటున్నాడు ఆ బస్తీవన్నీ వింతగానే ఉన్నాయి వాడి పసిమనసుకు. 'అమ్మగారు ఇదేంటండీ?' 'అదలా ఉందేం?' అనడుగుతూ ఉండేవాడు శ్రీలక్ష్మిని. రంగడి రాకతో శ్రీలక్ష్మికి వంటరిగా ఉండాల్సిన అవసరం లేకపోయింది. వాడంటే ఓ విధమైన ఆపేక్ష ఆమె మనస్సులో ముద్ర వేసుకుంది. తల్లిలేని కుర్రవాడిని ఎంతో ప్రేమగా చూసేది. చదువులో వాడికి తెలియనివన్నీ బోధపరిచేది! కాని ప్రకాశం సంగతే ఆమె కర్థంకాలేదు. రంగడి నలా తీసుకురావటం అతని కిష్టమో కాదో తెలియకుండా ఉండేది. ఆ విషయంలో ప్రకాశం ముభావంగా ఉండిపోయాడు. రంగడిని పెద్ద చనువుగా పలకరించేవాడుకూడా కాదు. వాడుకూడా 'బాబుగారొచ్చారు' అని దూరం దూరంగా ఉండిపోయాడు.

రోజులు దొర్లిపోతున్నాయి. ఈ మధ్యలో జరిగిన విశేషమొక్కటే. శ్రీలక్ష్మి తప్పనిసరిగా పుట్టింటికి వెళ్లింది.

పాపాయి పుట్టాక, ప్రకాశంలో కొత్త

చైతన్యం కలిగినట్లయింది. చిట్టి పాపాయిని ఎంత ఆడించినా, జోకొట్టినా తనివితీరింది కాదతనికి. ఇంట్లో ఉన్నంతసేపు పాప నెత్తుకొని కూర్చునేవాడు. ఏడ్చినా తనే ఓదార్చాలని తాపత్రయపడేవాడు. శ్రీలక్ష్మి 'ఇలా ఇవ్వండి' అన్నా వినేవాడుకాదు. ఆమె కాటుక కళ్లల్లోకి చూసి నవ్వుతూ 'పాప నాది తెలుసా?' అనేవాడు. 'ఏమిటీపిచ్చి? పాప ఆకలికి ఏడుస్తోంది' అని మందలించేది శ్రీలక్ష్మి.

పుట్టింటినుండి వచ్చాక ఓరోజు రంగడిని దగ్గర కూర్చోబెట్టుకొని పాఠం చెబుతున్న భర్తని చూసి ఆశ్చర్యపోయింది. శ్రీలక్ష్మి. పాపాయి పుట్టాక అతనిలో చాల మార్పు వచ్చిందనుకుంది, రంగడు కూడా అంతే. మొదటిలా దూరంగా ఉండకుండా 'బాబుగారూ' అంటూ దగ్గరికొచ్చి స్కూలు కబుర్లన్నీ చెబుతూ నవ్వించేవాడు.

ఇక రంగడికి అస్తమానం 'అమ్మాయిగారి' ధ్యాసే. బడికి వేళయిందని పదిమార్లు చెబితేగాని పాప పక్కనుండి కదిలేవాడుకాదు. ఈమారు సెలవులకుకూడా ఇంటికి వెళ్లలేదు వాడు. ధాన్యం పట్టుకొచ్చిన రామన్నతో 'మరే, మావయ్యా, నేను లేకపోతేనేం అమ్మాయిగారు ఏడుస్తారు' అని



ఇంటికి రాకపోవడానికి సంజాయిషీ చెప్పుకున్నాడు.

పాప మొదటి పుట్టినరోజుకి రంగడిక్కూడా కొత్తబట్టలు తెచ్చాడు ప్రకాశం. కొత్తబట్టలు కట్టుకుని సంబరపడిపోయాడు రంగడు. పాప పుట్టినరోజుకు పల్లెనుండి ప్రకాశం తలితండ్రులూ, ఊళ్లోని సరళా, మూర్తి వచ్చారు. ఎంతో వేడుగ్గా పండగ జరుపుకున్నారు. రెండు రోజులుండి వెళ్లిపోయారు వారు.

ఆ నాలుగోరోజు బడినుండి రాగానే 'తలనొప్పి' అని పడుకున్న రంగడికి జ్వరం ముంచుకొచ్చింది. క్షణాల్లో పెరిగిన జ్వర తీవ్రతను చూసి కంగారు పడిపోయింది శ్రీలక్ష్మి వెంటనే డాక్టరుకు కబురు పెట్టింది. డాక్టరు వచ్చి చూసి మందిచ్చి వెళ్లారు. సాయంత్రం ప్రకాశం ఇంటికి వచ్చేసరికి రంగడికి వంటిమీద తెలివిలేదు. వాడి పరిస్థితి చూసి శ్రీలక్ష్మికన్నా ఎక్కువగా గాబరాపడ్డాడు ప్రకాశం. అతని కాళ్లు, చేతులూ ఆడలేదు. కళ్ల నీరు నింపుకుని రంగడి ప్రక్కనే కూర్చుండిపోయాడు. అతని పరిస్థితి చూసి శ్రీలక్ష్మి కంగారు ఎక్కువయ్యింది మరునటిరోజూ జ్వరం తగ్గలేదు. శ్రీలక్ష్మి తనే ధైర్యం తెచ్చుకొని మందు మాకూ ఇస్తూ రంగడ్ని కనిపెట్టుకుంది. మధ్యలో భర్తను లేపి బలవంతంగా ఎంగిలి పడేలా చేసేది. మామూలు జ్వరానికింత అధైర్యపడితే ఎలాగని ధైర్యం చెప్పింది కాని కళ్లు తెరవకుండా పడిఉన్న రంగడ్నిచూస్తే ఆమెకూ భయంగానేఉంది పల్లెకు ఓపోస్టు కార్డు రాసి పడేసింది.

మూడోరోజు ప్రకాశం మరో పెద్ద డాక్టర్ని తీసుకొచ్చాడు. కాని అప్పటికే పరిస్థితి చేయిదాటిపోయింది. రంగడి కళ్లు మూసుకునే ఉన్నాయి. కాని పెదవులు మాత్రం కదులుతున్నాయి. శబ్దం బయటికి రావటంలేదు. మరి కొన్ని క్షణాల్లో ఆ పెదవుల కదలికకూడా ఆగిపోయింది. రంగడు శాశ్వతంగా కళ్లు మూశాడు.

శ్రీలక్ష్మి మతిపోయినదానిలా ఉండిపోయింది. 'ఇది నిజమా, ఇల్లంతా తిరుగుతున్న రంగడు ఇక లేనే లేడా?' ఈ సత్యాన్ని ఆమె నమ్మలేక పోయింది కాని ఎదురుగా నిర్జీవమైన రంగడి దేహం పడి ఉంది. ఆ మొహంలోని ముగ్ధతా, నిద్రపోతున్నట్టున్న కళ్లూ చూస్తుంటే ఆమె కడుపు తరుక్కుపోయినట్లయింది. 'రంగా' అంటూ క్రిందకూలిపోయి విలపించసాగింది. ప్రకాశం పిచ్చివాడిలా శ్రీలక్ష్మి వేపు చూశాడు. మళ్లీ రంగడివేపు చూశాడు. బుగ్గలు నిమిరి వంగి ఒక్కసారి ముద్దు పెట్టుకున్నాడు. లేచి వెళ్లి గదిలో కూర్చున్నాడు. అంతే ఓమాటా, పలుకూలేదు.

ఆ సాయంత్రానికే రామన్న వచ్చాడు. ప్రకాశం రామన్నకు మొహం చూపలేదు. మేనల్లుడి శవం మీద పడి ఏడుస్తున్న అతడ్ని ఓదార్చనూ లేదు. జరగవలసిందంతా జరిగిపోయింది.

రామన్న వెంటనే వెళ్లి పోవలసినవాడే. కాని రంగడి మరణంతో క్రుంగి పోయిన ఆ దంపతులను చూసి, ఉన్న ఒక్క మేనల్లుడూ పోయాడన్న దుఃఖాన్ని దిగమింగి, రెండు రోజులుండి ఓదార్చి 'సిన్నమ్మగారూ, పోయినాళ్లతో మనమూ పోలేంగందా, అడికి నూకల్లేవు. ఎళ్లిపోయినాడు. సిన్నపిల్ల తల్లివి, పాపాయిని జాగర్తగా సూసుకోమ్మ. సిన్నబాబుగారు జాగర' అని చెప్పి వెళ్లిపోయాడు.



శ్రీలక్ష్మికి అనుమానం రంగడిదే ధ్యాస. 'అమ్మాయిగార్ని నేనెత్తుకోనాండి? మరి నాకేసి చూసి నవ్వుతున్నారండి' ఇలా రంగ డన్నట్టే వినిపించేది. పాపను చూసు కుంటూ ఎలాగో రంగడిని మర్చిపోవటానికి ప్రయత్నిస్తోంది. రంగడి జ్ఞాపకాలు ఇల్లంతా నిండు కున్నాయి.

ఎవరికోసమూ కాలం ఆగిపోదు. రోజులు గడచినకొద్దీ రంగడి జ్ఞాపకాలు మసకబారు తున్నాయి. కొద్దిగా తేరుకుంది శ్రీలక్ష్మి కాని ఆమెకు కొత్తదిగులు పట్టుకుంది రంగడు పోయినప్పట్నుంచీ ప్రకాశంలో చెప్ప లేని మార్పువచ్చింది. రోజురోజుకు మనిషి చిక్కిపోసాగాడు. అడిగితే దేనికీ సరయిన సమాధానం చెప్పడు. మొదటిలా పాపను దగ్గరికి తీసుకునేవాడుకాదు. శ్రీలక్ష్మికి ఏవీ అర్థంకాలేదు. 'పరాయివాళ్ల పిల్లాడ్ని తమింట్లో తెచ్చిపెట్టుకుని ఇలా అయినం దుకు దిగులువడుతున్నాడా?' అడిగితే దానికి సమాధానం లేదు. వెర్రిగా శ్రీలక్ష్మి వెహాహంలోకి చూసి వెళ్లిపోయేవాడు. ఒక్కోమారు 'లక్ష్మీ' అని పిలిచేవాడు. ఆమె దగ్గరకు వెడితే ఆమె కళ్లలోకి చూసి ఏదో చెప్పబోయి ఆగిపోయేవాడు. 'ఏంలేదులే వెళ్లు' అనేవాడు నీరసంగా. శ్రీలక్ష్మికి ఏమీ బోధపడలేదు. అతడు మామూలు మనిషి కావాలంటే ఏం చేయాలో బోధపడలేదు.

ఇలా ఉండగానే ధాన్యం తీసుకుని వచ్చాడు రామన్న. శ్రీలక్ష్మికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. 'రంగడు పోయినప్పటి నుంచీ మీ చినబాబుగారిలా ఉంటున్నా రయ్యా. ఏం చెయ్యాల్లో తోచటంలేదు' అంది కంట నీరెట్టుకుంటూ.

రామన్న మొహం నల్లబడింది. గుట కలు మింగాడు. 'చిన్నమ్మగారూ, ఏవీ అనుకోనంటే ఓ మాట సెప్తా' అన్నాడు.

'చెప్పు'

రామన్న చెప్పిన సంగతివిని ఆమెకళ్లు తెరుచుకున్నాయి. భర్తస్థితి ఏమిటో ఆమెకు స్పష్టంగా అర్థమయింది. ఈ పరిస్థితుల్లో తను చెయ్యగలిగిందేమిటో ఆమెకు తెలియటం లేదు. ధైర్యం కూడగట్టుకుని భర్తకు సన్నిహితంగా మెలగసాగింది.

పార్కులో చీకట్లో, ఒంటరిగా కూచు న్నాడు ప్రకాశం. అతని మనస్సు మనసులో లేదు. ప్రపంచమంతా తిరిగి తనమీద పడుతున్నట్టే అనిపిస్తోంది. గొంతువరకు వచ్చిన దుఃఖం అక్కడే ఆగిపోయి ఊపిరి ఆడకుండా చేస్తోంది. ఎదురుగా ఉన్నదేదీ అతనికి కనిపించటం లేదు. ఎప్పుడో, ఎక్కడో జరిగిన సంఘటన కళ్లముందు మెదులుతూ, మనసును తొలిచివేస్తుంది.

పద్దేళ్లవెనుక ఆ పల్లెలో విశాలమైన ఇంట్లో ఓ చీకటి రాత్రివేళ తనచేతికి ఒంట రిగా చిక్కిన స్త్రీ, పెనుగులాడి, తప్పిం చుకోలేక, స్పృహకోల్పోయి తన చేతుల్లో ఒరిగిపోయిన స్త్రీ, నిందల్ని భరిస్తూ జీవ చ్ఛవంలా బతికి బిడ్డ పుట్టగానే కన్ను మూసిన స్త్రీ. ఆ స్త్రీ అస్పష్టరూపం అతని కళ్లముందు మెదులుతోంది. ఆ అనాధ శిశు ఆక్రందనం అతని చెవులకు విని పిస్తోంది. ఆనాటినుండి తనీబాధ ననుభవి స్తూనే ఉన్నాడు. ఎవరితోనూ చెప్పుకోలేని మూగబాధ మనస్సులో దాక్కుని సమయం వచ్చినప్పుడు తొంగిమూస్తూనే ఉంది. కాని ...కాని...ఇప్పుడు అంత జరిగాక ఇంకా ఆ బాధ ననుభవించటం అతనివితరం కాలేదు. 'ఊహూం, ఇక నాచేతకాదు. శ్రీలక్ష్మిని పోగొట్టుకున్నా సరే ఆమెతో చెప్పకతప్పదు. అన్న నిర్ధారణతో పైకి లేచాడు. అతని అడుగులు తడబడలేదు. చకచకా నడచి ఇల్లు చేరుకున్నాడు. పాప ఉయ్యాలలో నిద్రపోతోంది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. 'శ్రీలక్ష్మీ' అని పిలిచాడు ప్రకాశం. అతని కంఠం కొద్దిగా వణికింది. వెళ్లి మంచం మీద కూర్చున్నాడు.

'నీతో ఓ సంగతి చెప్పాలి శ్రీలక్ష్మీ!

శ్రీలక్ష్మి వచ్చి అతనిసరసనే కూర్చుంది. ఆమె కళ్లలో జాలీ మార్దవతా పొంగు తున్నాయి ప్రకాశం తన శక్తినంతా కూడ దీసుకున్నాడు.

'శ్రీలక్ష్మీ, నేను పతితుడ్ని'

బదులుగా శ్రీలక్ష్మి చిరునవ్వు నవ్వింది. రెండుచేతులతో అతడిని దగ్గరకుతీసుకుంది.

ప్రకాశం ఆమె చేతుల్లో తన మొహం దాచుకుంటూ 'రంగడు నా కొడుకు' అన్నాడు.

నాకు తెలుసు అంది శ్రీలక్ష్మి. ప్రకాశం ఒక్కక్షణం ఆమె వళ్లో వాలిపోయి వెక్కి వెక్కి ఏడవసాగాడు.

* * *

ఎంతవెతికినా శ్రీలక్ష్మికి తన ఆంతర్యంలో భర్తపట్ల అసహ్యం కాని, జుగుప్సకాని కని పించలేదు. బదులుగా అతని సాహచర్యంలో మొదటికన్నా తృప్తి, ఆనందం లభించాయి. ●





సీరియల్

తాడిగిరి పోతరాజు

జరిగిన కథ

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. పంచాయతీ ప్రెసిడెంటు ఎన్నికల్లో ప్రత్యర్థి వర్గంలోని కామయ్యమాష్టారి మీద శివరామయ్య నిందలుమోపి, స్కూల్లోనుంచి తొలగిస్తాడు. కర్తవ్యాన్ని గుర్తుతెచ్చుకుని శారదను ప్రసాద్‌తో వివాహానికి అంగీకరించమంటాడు కామయ్య. మధు శారదను తనతో వచ్చెయ్యమని ప్రాధేయపడతాడు. శారద ప్రయాణానికి సిద్ధమవుతుండగా ప్రసాద్ వస్తాడు. అంతా అర్థంచేసుకున్న ప్రసాద్ శారదను మధుదగ్గరికి చేర్చడానికి బస్సుఎక్కిస్తాడు. ప్రసాద్ ఇల్లువిడిచి వెళ్ళిపోతాడు. కామయ్య మాష్టరు బెంగపెట్టుకుని [illegible]క్కి శల్యమైపోతాడు.

## 27

'సిటీయాక్టు' క్రింద ఉన్న దొంగలు స్వగృహాల్లో ఉన్నారో లేక చీకటితో దోబూచులాడటానికి బయటికి వెళ్ళారో తెలిసికోటానికై సైకిళ్ళపై పోతున్నారు పోలీసులు — ఒకసారి నిద్రలేచి మందలు మందలుగా చెట్లు దాటుతున్నాయి కాకులు. చలిలో గజగజలాడి పోతున్నాడు చంద్రుడు.

'నాన్నట...నా ...న్న...రాక్షసి ... ఎంత మోసం చేసింది...కడుపులో చిచ్చుపెట్టింది.. ఎంత అవమానం...విద్యాబుద్ధులున్న దాని పని స్వేచ్ఛగా తిరుగనిస్తే—కళ్ళు గప్పి వాడితో'...

కోపంతో రాయి పుచ్చుకొన్నాడు వంగి బలంగా రోడ్డుపై విసిరాడు. దొర్లుతూ పోతూన్న రాతిపై సైకిల్ లైటు గుడ్డి వెలుగు పడింది. రోడ్డు రాచుకొంటూ సైకిళ్ళాగిన చప్పుడు.

'ఎవరు?'...పోలీసు కంఠం అడిగింది.

అటు తిరిగి గొణుక్కుంటూన్న మనలాడు సమాధాన మివ్వలేదు. సైకిళ్ళు దిగారు పోలీసులు. టార్చిలైటు వెలుగు అతని ముఖంపై పడింది. కనుకొలకుల నుండి అశ్రువులు రాలి పడుతున్నాయి. నోటి నుండి నెత్తురు కారుతోంది. రెండూ కలసి 'స్పాంజి'లా ఉన్న ఆ మురికి గడ్డం మీదుగా లాల్చీ పై బొట్లు బొట్లుగా పడుతున్నాయి.

'టార్చి' బటన్ నొక్కిన శబ్దం.

పోలీసులు రెండడుగులు వెనక్కి జరిగారు.

'కామయ్య—మాష్టారు...కూతురు లేచి పోయిన నాటినుండి మనఃస్థిమితం లేదు... పాపం బ్రతికి చెడ్డవాడు...ఈ ఊరి నెంత పైకి తీసికొచ్చాడు—చివరికీ గతి'... చిన్న స్థాయిలో పోలీసులు మాట్లాడుకొంటున్నారు.

'అది నా కూతురా?... కాదు..: నా కూతురు...చచ్చిపోయింది.' అతని ప్రేలాపన. ముందుకు తూలిపడి పొయ్యాడు. ఒక్కక్షణం పొయ్యాక మెల్లగా నిభాయించుకొని ఒక చేతితో మోకాలు పట్టుకొని మరో చేతితో తల పట్టుకొని లేస్తూ అశ్రువులు నిండిన కళ్ళతో వాళ్ళిద్దర్నీ చూశాడు.

ఒక పోలీసు చేయూత నిచ్చాడు.

'ఇంత చలిగాలిలో...పాపం, ఇంటి వద్ద దిగబెట్టి వెళ్దామా?' పోలీసుకంఠంలోజాలి.

'ఇంతదూరం వచ్చాం కదా! ... పని ముగించుకొని దిగబెట్టేశేద్దాం' — రెండవ వాని అభ్యంతరం.

ముంజేతిపై ఉన్న కోటు పైకి లాక్కుని 'టైమ్' చూసికొన్నాడు ఒక పోలీసు— పన్నెండు దాటింది— సైకిళ్ళు కదిలి పొయ్యాయి.

'ఇడియట్స్... ఇక్కడ ఒక్క నిముషం ఆగితే—ప్రాణం తీసేద్దును— అనవసరంగా నా చిట్టితల్లిని గూర్చి అబద్ధాలు ప్రచారం చేస్తారా?...అమ్మా...శారదా! రా... నేను నిన్ను క్షమిస్తాను రా... నీ మీద ఎన్ని ఆశలు పెట్టుకొన్నాను ... రా — నాకు 'గీతాంజలి' వినిపించు ... నేను పడుకొని వింటాను'...

కళ్ళు మూసికొని వెల్లకిలా పడుకొన్నాడు.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచి పోయింది.

'... దుర్మార్గురాలా...నిన్ను...'అమ్మా' అని పిలవటానికి కూడ అర్హురాలవు కావు...ఎంత అసభ్యం...ప్రతి బజారు వెధవకు నన్ను లోకువ చేశావు...నన్ను నల్గురిలో తలెత్తుకోకుండ చేశావ్...ఆరోజు... వాడు, ఆ భాస్కర్' లేకపోతే నన్ను వీధిలోకి లాగి'...

అంత చలిగాలిలో కూడ అతని ముహం పై స్వేదబిందువులు ఉద్భవించాయి. రెప్ప వాల్చక— శిలాప్రతిమలా కూర్చొని, బోసి పోయిన ఆ చెట్టుకేసి చూడసాగాడు. కళ్ళముందు గత జీవితపు సంఘటనలు ప్రత్యక్షమయ్యాయి.

తలుపులు పగలగొడ్తున్న శబ్దం — కేకలు — అసభ్యపు మాటలు వీధిలో వినవస్తున్నాయి, 'పంతులూ...తలుపు తియ్యి..' కర్రతో ఒకడు తలుపు పొడుస్తున్నాడు.

'మర్యాదగా తీస్తావా? ... పగలకొట్ట మంటావా?'..ఇంకొకడు వంతపలుకుతున్నాడు ముల్లుకర్ర చేతబట్టి.

'కూతురు పెళ్ళిచెయ్యలేక, ఉన్నవాడని— వాణ్ణి చేరదీసి మరగేసి, సూసినూడనట్టుంటే సరిపోద్దనుకున్నా!... వాళ్ళిద్దర్నీ పట్నంపంపి ఏమీ ఎరగనట్టే ఊళ్ళో ఉన్నా!...రా బయటికి...'

తలుపులు బాదుతున్న శబ్దం మరింత ఎక్కువైంది.

'ఎంత చదువుకొంటే మాత్రం 'ఈ డొచ్చిన పిల్లను—వయస్సులో ఉన్న కుర్రవానితో తిరగనిచ్చా డంటే ఏ ఉద్దేశ్యం లేందే ?...పట్నంలో రిజిష్టరు పెళ్లి చేసికోమని వంపించి ఏమీ ఎరగనట్టే ఇదొక నాటకం...ఈ నాటకాలు మనదగ్గర్నా'...

'తలుపు తియ్యకు నాన్నా ... వాళ్ళు... నిన్ను చంపుతారు ... మూర్ఖులు ... వాళ్ల జోలికి పోవద్దు నాన్నా...తలుపుతియ్యకు'... ఏడుస్తూ కాళ్లకు పెనవేసుకు బ్రతిమాలుతోంది తన చిన్నకూతురు.

'పిచ్చి భానూ...నీ వడ్డంరాకు ... చంపనియ్యి ... ఇంత అవమానం జరిగాక బ్రతకటమా...కొట్టండి ... చంపండి... రండి ... రండి ... ' పెద్దగా కేకలు పెట్టాడు — వంతెనమీద కూర్చుని ఆ వృద్ధుడు.

'శివరామయ్య గోరు సెబుతూనే ఉన్నా రండి...చినబాబుకు పంతులుగారు మరుగు మందు పెడ్తాడని—అన్నంతపనీ జరిగింది. 'చినబాబు గోరి మామగారి పెళ్లి పందిరి సూత్తోంటే కడుపు చెరువయి పోతోందండీ' ... శివరామయ్య జీతగాడు కంట తడి పెట్టబోయి స్తంభించి పొయ్యాడు.

'భాస్కరబాబు గోరు ... భాస్కరబాబు గోరు'...అంటూ జనంమీద పడ్డారు. ఒక నిముషంవరకూ అల్లరి వాయిదా పడింది. వాకిలి మెట్లమీదనుంచి జనం క్రిందకు దిగారు.

'ఏమిట్రా పేలుతున్నావ్ ?' ... చొప చెళ్ళుమంది.

'నో రెత్తావంటే జాగ్రత్త ... పళ్లు రాలగొడతా !...ఒక్క పూట తిండికి గతిలేని వెధవలకుకూడ పంతులు' — రాస్కెల్స్ ... ఒక్క నిముషం ఇక్క డున్నారంటే పోలీసులకు పట్టిస్తా...తలుపులు పగలకొడ్తారా? ...జాగ్రత్త...' భాస్కర్ కంఠం ఆవేశంతో గర్జించింది.

ఇంకా కొందరు యువకులువచ్చి అతని వెనుక నిలబడ్డారు.

'భాస్కర్...నీ వొక్కడివే...నన్నర్థంచేసికొన్న వాడివి ... నీ వొక్కడివే ఈ ప్రపంచంలో గౌరవించేది నన్ను...అందరూ నాకు ద్రోహం చేశారు. విశ్వాస ఘాతకులు ... వాడ్ని...వాడ్ని...నే నెంతగా ప్రేమించాను... కన్నకొడుకులా చూసికొంటే చివరకు నా చిట్టితల్లిని నాకు దూరంచేశాడు.

వంతెనమీద కూర్చున్న వృద్ధుడు ఆగి ఆగి ఆవేశంతో పలుకుతున్నాడు. ఆయాస మొచ్చింది. సన్నగాబాధ గుండెల్లో దూసుకుపోయింది. బాధగా మూల్గుతూ గుండెపై చెయ్యి పెట్టుకొని వంతెనగోడపై వెల్లకిలా పడుకున్నాడు.

నిర్మలమైన నింగిపై చందమామ ఒక్కడే దిక్కులేకుండ నిలబడ్డాడు.

*  *  *

'నాన్నా...నాన్నా...'ప్రక్కనుండి తుళ్లిపడి లేచి గాద్గదిక కంఠంతో భానసా పిలిచింది. సమాధానంలేదు. చీకటిలో తచ్చాడుకొంటూ వెళ్లి మంచంపై తడిమిచూసింది —పెరటితలుపు తీసింది.

ఆకులురాలిన దానిమ్మచెట్టు — పూలమొక్కలమినహా ఏమీ కనిపించలేదు. వెనక్కు తిరిగి గడియవేసింది—'నాన్నా' అన్న ఆవేదనతో ఇల్లంతామ్రోగింది. వీధిలోకి పరుగెత్తింది. ప్రక్కఇంటివాకిలి తట్టింది.

'పిన్నిగారు...పిన్నిగారూ' శక్తికి మించిన స్థాయిలో అరచింది. తలుపులు దడదడ కొట్టింది.

పశువులు మేతమేస్తున్న చప్పుడు మినహా మరింకే సవ్వడీ వినరావటంలేదు. ఒక్కక్షణమాగి మళ్లీ పిలిచింది.

'వెంకన్నా...వెంకన్నా!...' గొళ్లెం తలుపు కేసి కొట్టింది.



# మట్టి బొమ్మలు

'వస్తున్నా' -అంటూ ప్రతి సమాధానం వినిపించింది. రెండు మూడుద్వారాలు తెరచుకొని వస్తూన్నట్లు అలికిడి వినిపించింది.

'ఎవరు'—వీధివాకిలి తెరచుకుంది.

వాకిటిచెంతనున్న స్త్రీ మూర్తిని చూసి తలుపులు తెరచిన యువకుడు స్తంభించిపొయ్యాడు.

'ఏమిటి భానూ?...ఏం జరిగిందీ,'...

'భాస్కర్...మా నాన్నగారు—మళ్ళీ ఈ రోజుకూడా కన్పించటంలేదు. ఏమయ్యారో'...అశ్రువులు చెంపలమీదుగా జారిపోతున్నాయి. కుప్పలా మెట్లమీదకూలబడింది.

'లే'...'ఇంట్లో సరిగా చూశావా,'...'లోపలికి రా'...లోనికి నడిచాడు.

ఏడుస్తూ అవునన్నట్లు తల ఊపింది.

'సరే-భయపడకు...నేను...మన వెంకన్న కలిసి గాలించుకొస్తాం...మేము వచ్చేవరకూ 'అమ్మ'వద్ద ఉండు...లోనికెళ్ళు...ఇంత చలిగాలిలో ఎక్కడికి వెళ్ళుంటారూ'...కొంచంసేపు తటపటాయించాడు. ఆపాదమస్తకం ఆ నిండు యువ్వనిని పరిశీలించాడు. చలికి వణుకుతూ భుజాలు కప్పుకొంది.

'భాస్కర్' తను కప్పుకొన్న 'రగ్గు' వెంటనేతీసి భానుకు కప్పాడు శ్రద్ధగా రగ్గు తలమీదవేసికొని బొమ్మల్లో కాశ్మీరు యువతిలా నిల్చుంది భాను. కాని ఆ అమ్మాయి కన్నుల్లో కోపం గ్రహించి కళ్ళు క్రిందకు దించేసుకున్నాడు. ఏదో మాట్లాడా లనుకొన్నాడు. కానీ మాట్లాడలేదు.

'భాను'-తనమీదనున్న 'రగ్గు' తీసి మంచంపై జారవిడిచింది.

అవమానింపబడ్డట్టు బాధ పడ్డాడు. నేరస్థునిలా తల వంచుకొని నిలబడ్డాడు. ఒక్క నిముషం తను అతనిని పరిశీలనగా చూసింది. అతను మళ్ళీ ఈ ప్రపంచంలో పడ్డాడు.

'మాష్టారికి మళ్ళీ మనస్థిమితం ఉండటంలేదా? భాను'...

'నీకు తెలియనిదేముంది భాస్కర్...పక్షవాతం వచ్చిననాటినుండి నాన్న ఆరోగ్యం బాగులేదు. మూడుసంవత్సరాలయినప్పటికీ అక్క చేసినపని అనివార్యంగా తలపుకొచ్చి కృంగిపోతుంటారు నాన్న. దానికితోడు ఆర్థిక పరిస్థితులు మరింత వేధిస్తున్నాయి. ఆశయాలపేరుతో—తనకు మాలిన ధర్మంతో జీవితాన్ని ఇతరులకు ధారవోసి రిక్తహస్తాలతో ఉండిపొయ్యాడు. తన మేలును పొందిన వాళ్ళనుకూడా చేయిచాపి అడగలేని ఆత్మాభిమానం. వీటికితోడు నాన్నకు నాదొక దిగులు. నా భవిష్యత్తును గూర్చి ఆలోచిస్తూ వెర్రిగా నాకేసి చూస్తుంటారు నాన్న'...దుఃఖసంరుద్ధమై పోయింది కంఠం.

అప్పటివరకూ రెప్ప వాల్చక తన ముఖం చూస్తున్న భాస్కర్ కనురెప్పలు దించుకన్నాడు. 'పరిస్థితులు అంత అధ్వాన్నంగా ఉంటే మీ నాన్నగారు చెప్పలేకపోయినా నీవైనా ఒక్కమాట చెప్పకూడదా భానూ? ...కాలేజీకి పొయ్యాక నేను మారిపొయ్యానుకొంటున్నావా?'...

'అంతమాట నే ననగలనా భాస్కర్... ఇప్పుడేకదా?... నీ జాలి హృదయానికి చిహ్నంగా చలిలో ఒణికిపోతున్న నాకు 'రగ్గు' కప్పావ్'...

అతను కలవరపడ్డాడు.

'నేను చేసిన పని తప్పా,'...అమాయకంగా అడిగాడు.

'తప్పొప్పుల వ్యత్యాసం నాకు బాగా తెలియదు భాస్కర్...కానీ ఇతరులు వాపట్ల జాలీ...సానుభూతి చూపటం నా కిష్టంలేదు'—అని ఒక క్షణమాగి 'నేనురోజూ చలిలో ఒణికిపోతున్నాను...ఇప్పుడు నీదయాదాక్షిణ్యాలపై ఆధారపడి నీ రగ్గు కప్పుకొన్నందువలన నాకు కలిగే సౌఖ్యమేముంది'...అంది!

ఆ మాటకు వెంటనే ఏమీ సమాధానం చెప్పలేక 'షాక్' తిన్నవాడిలా ఒకే భంగిమలో నిలబడ్డాడు భాస్కర్. అతని పెదవులపై దృష్టిని నిలిపింది తను. భృకుటిపైకెత్తి నిశీధిలోకి చూశాడు ఒక్క క్షణం.

'సరే...భాను...మన్నించు...మాష్టారి కోసం వెళ్ళివస్తాను. లోనికెళ్ళి మా అమ్మ వద్ద పడుకో'...అన్నాడు.

'ఎందుకు వాళ్ళకు నిద్రాభంగం... మీరొచ్చేవరకూ ఇక్కడ్నే కూర్చుంటాను'...

భాస్కర్ పాలిట్లోకెళ్ళి పాలేరు వెంకన్నను నిద్ర లేపాడు. టార్చిలైటూ కర్రతీసికొని, వెంకన్నతో సహా మెట్లుదిగి మంచులో కలిసిపొయ్యాడు.

భానూ మంచంపై పడిఉన్న 'రగ్గు'కేసి చూసింది. ప్రేమతో దాన్ని స్పృశించింది.

# ప్రతిబొమ్మలు

కౌగిలించుకొంది. దాన్నితీసి ఇంతకుముందు తనకు అత నెలా కప్పాడో ఆ విధంగా కప్పుకొంది.

శరీరానికి చలి తాకటంలేదు. కానీ హృదయం ఒణికిపోసాగింది. ఐదు నిముషాలు గడచిపొయ్యాయి.

ఎవరో మనుషులు వస్తూన్నట్లు కాళ్ళ చప్పుడు వినిపించింది. భానూ పెద్దపెద్ద అంగలేసికొంటూ వీధివాకిట్లోకి నడచింది. దట్టంగా పట్టిన మంచులోగుండా ఇద్దరు పోలీసులు ఒక వ్యక్తిని భుజాలపై వేసికొని వస్తున్నారు. కుక్కలు వారిని వెంబడిస్తున్నాయి అరుస్తూ.

'ఎవరు?'...ప్రశ్నించింది.

'మేమేనండీ...మాష్టారు హైస్కూలు వద్ద పడిపోయిఉంటే తీసికొస్తున్నాం'... భాను లోపలికెళ్ళి హరికేన్ దీపం వత్తి పెద్దదిచేసి తీసికొచ్చింది. తండ్రికి స్పృహ తప్పిపోయింది. పెదవులు నెత్తురుతో గడ్డ కట్టుకుపొయ్యాయి.

దీపంతీసికొని తన ఇంటివైపు దారి తీసింది.

'మీరు ముందు లోపలికి పదండి... పోలీసు హెచ్చరించాడు. భానూ లైటు చూపిస్తూంటే పోలీసులు జాగ్రత్తగా కామయ్యగారిని లోనికి తీసికొచ్చి పడుకోబెట్టారు. 'బాగా జ్వరమొచ్చింది... జాగ్రత్తగా చూస్తుండండి' అంటూ పోలీసులు శలవు పుచ్చుకున్నారు.

తడిగుడ్డతో పెదవుల చుట్టూవున్న రక్తాన్ని తుడిచి తను కప్పుకొన్న 'రగ్గు' తీసి తండ్రికి జాగ్రత్తగా కప్పింది. తలగడ ప్రక్కగా కూర్చుంది.

మాష్టారు అపస్మారక స్థితిలో పడి ఉన్నాడు కొద్దిసేపు. మధ్య మధ్యలో మూలుగుడు అర్థంలేని ఏవేవో మాటల సణుగుడు. కొంతసేపటికి బాధగా మూల్గుతూ కళ్ళు తెరచి చూశాడు. మొత్తని ఖరీదైన ఉన్ని దుప్పటి స్పర్శ తెలిసికున్నాడు. ఎర్రగా జ్యోతుల్లా మెరుస్తున్న కళ్ళు ప్రక్కకుతిప్పి తన చిరుగుల శాలువాకోసం వెదికాడు. చేతులకు తగలలేదు.

'భానూ'—కఠినంగా పిలిచాడు,

'ఇక్కడే ఉన్నా నాన్నా' ... ఆతురతగా చెప్పింది.

'ఈ అర్ధరాత్రివేళ ఈ రగ్గు మనింట్లోకి ఎలావచ్చిందో చెప్పు...నిజం చెప్పు—పాపిష్టిదానా—నీవూ—దానికేమి తీసిపోవు—అక్కచెల్లెళ్ళు—ఇద్దరిద్దరే—నా కడుపున చెడ బుట్టారు. నేనింట్లోలేని సమయం చూసి...' దగ్గుతెర అడ్డమొచ్చింది.

ఆయాసపడి లేచి కూర్చోబోయినవాడల్లా—మళ్ళీ వెల్లకిలావాలి కళ్ళు మూసికొన్నాడు. ఒంటిమీద రగ్గును కాళ్ళతో తన్ని పారేశాడు.

తండ్రి తనపై మోపుతూన్న అసత్య నిందారోపణకు ఆ యువతి హృదయం విలవిలా తన్నుకుంది.

ప్రత్యక్షానుభవంతో ఆదర్శాలు అర్థవిహీనంగా కనిపించినప్పుడు — మానసిక దౌర్బల్యం ఏర్పడి ఎంతటి విద్యావంతుణ్ణి — చదువు — సంస్కారం కలవాణ్ణయినా అవివేకిగా మారుస్తాయి. ఎదురు చూడని అవాంతరాలు—పరిస్థితుల ప్రభావం తన తండ్రినెలా కృంగదీస్తున్నాయో అవగాహన చేసికొని నిశ్చలంగా దీపంకేసి చూస్తూ దీర్ఘంగా ఆలోచించ సాగింది.

జీవితంలో ఒక విధమైన సంయమం — ఉన్నత భావాలతో—సంస్కృతితో బ్రతికిన తనతండ్రి సహజమైన యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కోల్పోయి, తన ప్రవర్తనను శంకించటం ఆమెకు దుస్సహమైంది.

వీధిలో అలికిడివిని, లేచి నిలబడింది.

'భాస్కర్ — వెంకన్నతో సహా ప్రవేశించాడు—' ఎంత వెదికినా జాడ కన్పించలేదంటూ. పోలీసులు తీసికొచ్చారని తెలిపింది. మాష్టార్ని చూడటంకోసం ఆతురత ప్రకటించాడు భాస్కర్.

'ఇప్పుడే పడుకున్నారు...లేపకు...' అంది.

'అయితే వెళ్ళి డాక్టర్ని తీసుకురానా?'

'అవన్నీ తెల్లవారాక చూసికోవచ్చు భాస్కర్.. ఇక నీవెళ్ళి పడుకో' ... వాకిటిలో వాడ్ని వాకిట్లోంచే పంపించటానికి ప్రయత్నించింది.

'సరే ... వెంకన్నా...నీ విక్కడే వడుకో ...అవసరమయింతే కబురుపంపించు భానూ'... అంటూ భాస్కర్ వెళ్ళాడు.

అతను అటువెళ్ళిన కొద్దిసేపటికే కోడి కూసింది.

దానికి ప్రతిగా కొన్ని కోళ్ళు మారు పలికాయి.

అరకలు నేలగీచుకొంటూ వెళ్తున్నాయి. రోళ్ళల్లో గింజలు దంచుతూన్న చప్పుడు వినబడ సాగింది. తెల్లవారిందని తెలిసి చందమామ తెల్లబోయ్యాడు.

'భాను'...పిలుపువిని ఉలిక్కిపడి వెను తిరిగి చూచింది. ఫ్లాస్కు టిఫిన్ చేత్తోపట్టుకొని భాస్కర్ లోనికొచ్చాడు. అతనివెంట వాళ్ళ అమ్మనాన్న వచ్చారు.

'పంతులుగారికి జరమెట్టుందమ్మా...చిన్నమ్మాయి...ఎక్కువైందా?... రాత్రి ఇంటి కొచ్చిందానివి నన్ను లేపకూడదూ,...' లోనికి అడుగు బెడుతూనే కోటయ్య ప్రశ్నించాడు.

'వాడితో చెప్పలేకపోతే నాతోనైనా చెప్పకూడదూ?...నాన్నకు ఒంట్లో బాగుండటంలేదని—ఏమిటి?—ఈ చిరిగిన బట్టలు ...పిచ్చితల్లీ... బట్టలు మార్చుకుందువుగానిరా...ఏదో పొలం పనులమూలంగా తీరికలేకపోతే...మీ అమ్మ చచ్చిపోయినా—నే బ్రతికే ఉన్నానుగా...'అంటూ ఆప్యాయంగా రెక్క పుచ్చుకొని లాక్కుపోయింది భాస్కర్ తల్లి.

మూగదానిలా అనుసరించింది భాను.

'అమ్మాయ్...వాళ్ళ కింతబెట్టి పొలాలు పంపించివస్తా...నాన్నకు జ్వరం తగ్గేవరకూ మా యింట్లోనే భోంచెయ్యి...నీవు తినే పిట్ట మెతుకులకు వేరే వండెందుకు?' అని మళ్ళీ విడిచివెళ్ళింది.

'పంతులుగా రింతలో లేసేట్టు లేదు... నే నటు పోయొస్తా' అంటూ స్వగతంగా చెప్పుకొంటూ కోటయ్య వెళ్ళిపోయ్యాడు.

(ఇంకా ఉంది)

# విజయీ భవ! —



వద్దుర బాబోయ్, పిల్లలు వద్దుర దేవుడోయ్!—

ఈ సంతానం చాలు.

జనాభా తగ్గాలి, తగ్గించాలి, తగ్గించ యత్నించాలి.

సంతాన నియంత్రణలోనే వుంది నిజమైన సంతోషం.

—అంటూ వినడిస్తున్న ఈ నాడు కూడా పుత్రకామేష్టి చేసి, పిల్లల కోసం పలవరిస్తున్న వాళ్ళూ వున్నారు. కన ఓపిక లేనివాళ్ళు కష్టపడి కంటూనూ వున్నారు.

'జిహ్వను కట్టెయ్యాలి. అదే అనర్థాలన్నింటికీ మూలం' అంటూ ఒక వంక వేదాంతుల మహావాక్యాలు వినవస్తున్నాయి.

కారం, ఉప్పు, పులుపూ మానెయ్యండి అని డాక్టర్లు పథ్యం చెబుతూనే వున్నారు.

'షడ్రుచులతో పెరిగే సామాన్య మానవుడు భార్య దగ్గరుండగా ఆత్మనిగ్రహమూ, కుటుంబ నియంత్రణమూనా?' అని ప్రశ్నిస్తున్నాడు ప్రతిపక్షీయుడు.

నే నుపదేశించే మంత్రాన్ని పఠిస్తూ 'భార్యా భర్తలు వేరు వేరు గదులలో శయనించండి' అంటూ హాస్య ప్రియుడు.

ఇందులో ఏదీ చెవిని పెట్టటంలేదు జనం—దేని దారి దానిదే అన్నట్టు.

* * *

అబార్షన్ పంచమహా పాతకాల్లో ఒకటి అంటున్నాయి మన శాస్త్రాలు. అది పాపం కాదుగదా, అత్యవసరమైన ప్రక్రియ అంటున్నారు ఆధునిక శాస్త్రజ్ఞులు. బొడ్డూడని పిల్లలు సైతం లూపులూ, పిల్సూ, ఆపరేషన్లు అని కంఠోపాఠంగా వల్లిస్తూ వుంటే, ఇంక సిగ్గు అనే మాటకు చోటెక్కడ?

దసరా పిల్లల సరదాలన్నీ నాడే — ఆ నాడే. ఈ నాడు గిలకల బద్దలు మూలపడ్డాయి కదా. పంతుళ్ళు మామూళ్ళడగలేరు. అడిగితే పిల్లలు ఘెరావో చేస్తారని భయం.

ఈ శుభసమయంలో ఇంకా ఎంతో కుతూహలం, కోలాహలం — వనితల ప్రత్యేక సంచికలు, వ్యాస రచన పోటీలు, బొమ్మల కొలువులు, అల్లుళ్ళ పిలుపులు, అభ్యంగనాలు, అపురూపమైన పిండి వంటలు—ఇవి రచనల కథా వస్తువులలో కొన్ని. ఇవి మామూలే.

* * *

పంచదార, పచ్చి బియ్యం, రేషను దినుసులు, ఏదడిగినా ముందుగా లా శేత్వం—దాక్కోమ్మా.

ధరవరలు ఎక్కిపోతున్నాయి, జీతాలు చాలవు, అప్పులు పుట్టవు—ఇవి దినసరి వార్తలు!—

ఇక వీధి బాగోతాలు—

—కురువీరులంతా మూర్ఛిల్లారు. ఉత్తరకుమారుడు బిత్తర పోయాడు. సైగ చేశాడు—బృహన్నల.

చెల్లెలు ఉత్తర గుర్తుకు వచ్చింది. బొమ్మలకు రంగు రంగుల గుడ్డలూ, నగలూ సేకరించాడు. ఇంకా కదల్లేదు. ఆలోచన...!—

([illegible] వ పేజీ చూడండి)





# గత ప్రాచీనకాలపు విశిష్టతను మారుమ్రోయించుచున్నవి.

ప్రశస్తమైన సుందరమగు
'మఫత్‌లాల్ గ్రూప్ వోయిల్స్'.
సాంప్రదాయ విరమణ.
సాంప్రదాయ పునరోద్ధరణ




## మఫత్‌లాల్ గ్రూప్
## 2 X 2 వోయిల్స్
## మరియు లినోస్

'టెరీన్'/కాటన్స్, 'టెరిలైట్' మరియు
'షఫినైట్' క్వాలిటి

న్యూ శోరక్ (శోరక్) అహమదాబాద్ . న్యూ శోరక్ నడియాడ్ . స్టాండర్డ్, బొంబాయి. స్టాండర్డ్ (న్యూచైనా) బొంబాయి . స్టాండర్డ్, దేవాస్ . సాసూన్ బొంబాయి . సాసూన్ (న్యూ యూనియన్) బొంబాయి . సూరత్ కాటన్, సూరత్ - మఫత్‌లాల్ ఫైన్, నవసారి, మిహిర్ టెక్స్‌టైల్స్. అహమదాబాదు

(M. 201 TL)

**ఒకవారం విపరీతం**

# ఆపరేషన్‌కి వెళ్తే వళ్లంతా గాయాలు

బ్యూనోస్ ఎయిర్స్‌లో (విదేశం) ఒకాయన తన పాదంలో 'ఆనెకాయి' బాధ పడలేక ఆసుపత్రికి వెళ్లాడట. డాక్టర్లు ఆయనకి మత్తుమందిచ్చే సరికి మోతాదు ఎక్కువయి అతని గుండె ఆగిందట. డాక్టర్లు దానిని తిరిగి మామూలు స్థితికి తేవడానికి రొమ్ము ఆపరేషను చేశారట. దురదృష్టవశాత్తూ వారు వుపయోగించిన ఆక్సిజన్ పనిముట్లు మధ్యలో పేలిపోవడం వల్ల అతని పొత్తికడుపులో నాళాలు వుబ్బాయట. దానికి మరొకచోటికి తీసుకు వెళ్లబో తుంటే లిఫ్టు చెడిందట చేసేదేమీ లేక మోసి, మెట్లు మీంచి దింపుతున్న పనివాడి చేయి జారి అతను మెట్లు మీంచి దొర్లిపోయాడట. దాంతో తొడఎముక, భుజపుటెముక విరిగాయట సరిచేసి అతన్ని మళ్లీ ఆపరేషన్ థియేటరుకి తీసుకెళ్ళారట.

ఆనెకాయల బాధే పడలేక వచ్చిన అతనికి అన్ని ఆపరేషన్లు చేసి, వళ్ళంతా కట్లుకట్టి కూర్చో పెట్టారు. చివరికి 'ఆనెకాయి' ఆపరేషన్ మాత్రం చేయలేదు.

## శిక్ష(ణ)

బర్మానుంచి పంపబడ్డ అర్జునరావు అనే భారతీయుడు వస్తూ వస్తూనే విశాఖపట్నంలో 29వ తేదీ దెబ్బలాట పెట్టుకున్నాడు. తన భార్యపట్ల ఎవరో ఒకవిద్యార్థి అమర్యాదకరంగా ప్రవర్తించా డని అతన్ని చితకతన్నాడట దాంతో ఆ కాలేజి విద్యార్థులంతా చేరి విరుచుకు పడ్డారు అర్జునరావు పోలీసు రక్షణలో వుండడంవల్ల మరింత రభసై, చివరికి కాల్పులవరకు వెళ్ళింది. ఫలితం ఒకవిద్యార్థి మరణం!

* * *

మధురలో 28 లన కురిసిన వానవల్ల ఒక కరెంటు తీగ జారి నేలమీదపడి, దారినపోతూ చూడకుండా దానిమీద కాలు వేసిన ఒకవ్యక్తిని పొట్టన పెట్టుకుంది.

బొంబాయి హార్బరుకు వస్తున్న ఒకఓడనుఅనుమానించి, కస్టమ్స్‌వారు ఎదురు వెళ్లి సోదా చేస్తే మూడు లక్షల కిమ్మత్తు చేసే వాచీలు వగైరాలు దొరికాయట. సోదా చేస్తుండగా ఆనరుకుతెచ్చిన వాటిని సముద్రంలో తోసెయ్య బోయారట. దీనివల్ల కాల్పులు జరిగాయి. ప్రాణనష్టంమాత్రం లేదు.

చనిపోయిన పక్షి ఒకటి తనయింటి ముందు పడివుండటం చూసి ఆయింటాయన పక్కింటాయన్ని పిలిచి, 'నువ్వే చంపేశావు' అని పోట్లాడి, కసి తీరక చేతిలో బాకుతో అతన్ని తూట్లు పొడిచాడు. ప్రాణం పోలేదుగాని అవతలింటాయన వళ్ళంతా గాయాలేట— యిది ఢిల్లీలో జరిగింది.

## నడవకపోతే పక్షవాతం

రష్యాలో జక్రోవ్ అనే ఆయన్ని డాక్టర్లు పరీక్షించి, 'మీరు నడవకపోతే పక్షవాతం వస్తుంది. శరీరానికి వ్యాయామం అవసరం' అన్నారట. అందువల్ల 1962 నుంచి నేటివరకూ ఆయన ఒక లక్ష కిలోమీటర్లు నడిచారట. డాక్టర్లీసారి చూసి 'ఫర్లేదు తప్పించుకుంటున్నారు'' అన్నారట.

## ముష్టివాళ్ల తీర్మానం

జయపూర్‌లో మొన్న 19 తేదీన అయిదువేల మంది ముష్టివాళ్లు ఒక బహిరంగసభ ఏర్పాటుచేసుకుని, యికమీద ముష్టి ఎత్తరాదు. కష్టపడి పని చేయవలెను అని తీర్మానించి, ఒడంబడికలు వ్రాసుకున్నారు.

* * *

నాసిక్‌లో 22 వ తేదీన గొడవ జరిగింది. దాంతో అల్లరి చెలరేగి, ఫలానా తెగవారే యీ పని చేశారని రెండు కక్షలుగ విడి, కక్షలు సాధించుకో బోయే సరికి పోలీసులు అడ్డుపడ్డారు. అయినా, వారిని కూడా రభ్భతో కట్టడంవల్ల కాల్పులు జరిగి పో అయిదుగురు చనిపోయారు. 65 మందిని పోలీసు అరెస్టు చేసింది.

## చనిపోయిన భార్యను కలుసుకో డానికి పారాచూట్

ఫ్లోరిడాలో ఒకతను పారాచూట్ విప్పకుండ విమానంలోంచి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. అయిదేళ్ళక్రితం పారచూట్ ప్రమాదంలో చని పోయిన తన భార్యను కలుసుకో డానికి తనకి దొరికిన అవకాశాన్నిసద్వినియోగం చేసుకున్నట్లు ఒకలేఖరాసి జేబులో పెట్టుకుని వున్నాడట. — సహగమనమా!

* * *

రాయపూర్ చిరిమురి రైల్వే స్టేషనులో ఒక రైలు నలుగురుగా ఆడపిల్లల మీదుగా పోయిందట. ఒక పిల్ల మాత్రం అక్కడికక్కడే చనిపోయింది. ఆ దారుణం చూసిన జనంలో ఒకడు డ్రయివరుని గమ్మున బయిటికిలాగి, సరికి చంపేశాడట. మిగిలిన జనం స్టేషనుకు నిప్పంటించారు.

## స్కూల్ ఆవరణలో బాంబు

ఈ 18 న, నాజరాబాద్‌లో ఒక స్కూలు ఆవరణలో ఆడుకుంటున్న విద్యార్థులు ఆ స్థలంలో కనుపించిన ఒక వస్తువుని చేత్తో తీసేసరికి అది 'ఢాం' అని పేలి ఆ విద్యార్థి అక్కడే చని పోయాడు. మరొకతను ఆసుపత్రికి తీసుకువెళుతుండగా చనిపోయాడు. అది ఒక బాంబట— అదక్కడి కెలా వచ్చింది? ఎవరి దీ అజాగ్రత్త!

* * *

మెక్సికోలో మాంటెర్రే పట్టణానికి సమీపాన గత బుధవారం నాడు ఒక ప్రయాణికుల రైలు గూడ్సుబండిని ఢీ కొంది. 20 మంది మృతి, 70 మందికి గాయాలూ అని లెక్కలు తేలాయి.

ఇండోర్‌లో బారీబాయ్ అనే వృద్ధురాలు చని పోయింది. ఆనాటికి ఆమె వయస్సు నూటపది కాండు ఏళ్లట! అన్నాళ్లు బ్రతకడమే విడ్డూరం.

* * *

ఢిల్లీలో 22 వ తేదీన టిక్కట్టు లేకుండ బస్సులో ప్రయాణం చేస్తున్న ఒక వ్యక్తి పెట్టె పరీక్షిస్తే 31 తూకాలు తూగే మూడు బాంబులు, ఆరు గ్రెనేడులూ దొరికాయట— ఎవరతను? వాటితో ఏ ఘాతుకం చెయ్యబోతున్నాడో!!

—ఫాలాక్షుడు.



*ప్రపంచసుందరి నిజప్రవర్తన తెలిపే అంతరంగిక గాథ!*

ఫాషన్ ప్రపంచంలోకి ఒక అమ్మాయి వచ్చి పెద్ద దుమారం లేపింది. ఈ అమ్మాయి పేరు రీటా ఫరియా. ఆమె ఒక సారి ప్రపంచ సుందరి బిరుదు గెలుచుకుంది.

ఈ మధ్యనే తను ఫాషన్‌ల సృష్టి మొదలుపెడతా నన్నది. తనే కొత్త ఫాషన్ లని ధరించి చూపిస్తానన్నది. ప్రకటన వెలువడిన రెండు రోజుల్లో మరొక సంచలనం ఏర్పడింది. మరొక 'ఫాషన్ నిర్మాత' మిస్ ఫరియా తన డిసయిన్లని కాపీ కొట్టిందని ఆరోపించింది!

ప్రపంచ సుందరి 10నెలల 'పరిపాలన' లోనూ ఇటువంటి గొడవలు చాలా జరిగాయి.

ఎంతో వినయంగా ఉండే ఒక మెడికల్ విద్యార్థిని ప్రపంచ సుందరి బిరుదు తెచ్చుకోగానే అంతకి ముందు ఈ బిరుదు పొందిన మరే అమ్మాయి సంపాదించుకోలేనంత 'కీర్తి' సంపాదించుకుంది

ప్రపంచ సుందరి పోటీ నడిపే 'మెక్కా' సంస్థ అధిపతి శ్రీ ఎరిక్ మార్లీ కూడా అన్నాడు: 'ఇంత గొడవ ఇంతకి ముందెప్పుడూ జరగలేదు!'

ఇప్పుడేమయినా ప్రత్యేకంగా జరిగిందా ?

ఇర్విన్ సెల్లార్స్ ఫాషన్ సంస్థలో మిస్ ఫరియా కాక ఇతర యువతులు కూడా ఉన్నారు. వారిలో 22 ఏళ్ల జేన్ ఫాక్స్ కూడా ఉంది. మిస్ ఫాక్స్ ఇటీవలే తన పనికి రాజీనామా ఇచ్చింది.

'నా డిసయిన్లన్నిటినీ తనవే అంటోంది మిస్ వరల్డ్,' అంది జేన్‌ఫాక్స్. 'బొమ్మలన్నీ నేనే గీశాను. బట్టల ఎన్నిక నాదే, డిసయిన్లు, పాటర్న్లూ, సాంపిల్‌లూ అన్నీ నావే—పనంతా నేనే చేశాను !'

'అసలు మిస్ వరల్డ్‌కి ఫాషన్ నిర్మాణం గురించి ఏమి తెలుసు? ఎవరయినా చేస్తే వేసుకోగలదు, అంతే! మిస్ ఫరియాకి గోనె గుడ్డంటే ఏమిటో, సిల్కు అంటే ఏమిటో తెలియదు!'

మిస్ ఫరియాకి ఈరకం విమర్శలు బాగా అలవాటయిపోయాయి. 'జేన్ రాజీనామా విని ఆశ్చర్యపోయాను. మంచిఅమ్మాయి. ఈ ఫాషన్లన్నీ మేమిద్దరం కలిసి తయారు చేసినవే.

'బొమ్మలు నేను గీశాను. వాటిని చూపి జేన్ కొన్ని దుస్తులు కత్తిరించింది.

'కత్తిరింపులు నాకు రావు. అసలు నేను నేర్చుకోనేలేదు ! అయితేనేమి, భావాలు, ప్రభావం నావి. డిసయిన్లు నేర్చుకుంటే వచ్చేవా?'

బిరుదురాగానే — పోటీలో నెగ్గగానే— రీటా ఫరియా అంది, 'నాకు పేరు ప్రతిష్ఠలు అనవసరం. ఇండియాకి తిరిగి వెళ్లిపోయి డాక్టరుని కావాలనుకుంటున్నాను,' అని. ఇది ఎంతకాలంకింద అన్న మాట?...

మనస్సు మార్చుకుంది. ప్రపంచం అంతటా కోట్లాటలూ, పేచీలూ— వీటితో పేరు సంపాదించుకుంది.

'మెక్కా' సంస్థతో కాంట్రాక్టు విషయమయి పోట్లాడింది. ప్రదర్శనల విషయమయి పేచీ పెట్టింది. కాంట్రాక్టుని



రద్దు చేస్తానని జడిపించింది.

భారత ప్రభుత్వంతోనూ పోట్లాటే— వియత్నామ్ సోల్జర్ల వినోదార్థమయి సయిగాన్ వెళ్లింది. ఇది భారత ప్రభుత్వ విధానానికి విరుద్ధంగా ఉంది.

ఇక ప్రేమ వ్యవహారాల సంగతి చూద్దాము. బిరుదు తెచ్చుకున్న మూడు నెలలలో అసలు పెళ్లి చేసుకుందామనుకున్న భారతీయుడు, అన్‌బార్న్‌లోబోతో తెగతెంపులు చేసుకుంది! చాలా పుకార్లు బయలుదేరాయి. వీటన్నిటినీ మిస్ ఫరియా ఖండించింది. తనొక సిక్కు వ్యాపారితో వివాహం కుదుర్చుకొనటం లేదంది. ఎందరో ఈ మాట నమ్మలేదు.

మే నెలలో లాస్ ఏంజిలెస్‌లో ఉంటున్న డేవిడ్ గార్టన్ అనే లాయర్‌తో, తన వివాహం జరగపోనున్నదని ప్రకటించి అందరినీ చకితుల్ని చేసింది. గార్టన్ వయస్సు 31.

ఆమె తెచ్చిన తాజా పేచీ ఒకటి ఉంది: ఎకువ దోర్ అనే దేశంలో కొన్ని ప్రదర్శనలు ఇచ్చి ఉండవలసింది ఇవ్వలేదుట. అక్కడి ప్రదర్శకులు మెక్కా సంస్థని నష్టపరిహారం ఇచ్చుకొమ్మంటున్నారుట— 21,000 రూపాయలదాకా.

మిస్ ఫరియా 3 రోజులు ఆలస్యంగా రావటంచేతనే చాలా ప్రదర్శనలు రద్దు అయ్యాయి. దీనికితోడు ప్రపంచసుందరి సరంజామా కొంత తీసుకురావటం మరిచిపోయింది— కిరీటం, చిన్న 'గద', నడుం చుట్టూ కట్టుకునే 'కటిసూత్రం'; తక్కిన సుందరులతోబాటు ఈతసూటు వేసుకుని ప్రదర్శన ఇవ్వనంది.

మిస్ ఫరియా పాల్గొనవలసిన ప్రదర్శన ఒకటి వికలాంగుల సహాయార్థం ఏర్పాటు చేసినది. దీనికి ఎకువదోర్ అధ్యక్షుడు, ఆయన సతీమణి, ఇతర మంత్రులు వచ్చారు.

'కాని ఆమె ఎవరిపట్లా మర్యాద చూపించలేదు. అధ్యక్షుడిపట్లా కూడా!' అని ధుమధుమలాడాడు ఈ ప్రదర్శన నిర్వాహకుడు సెనోర్ మార్కో తోబార్.

ఇంతలో డేవిడ్ గార్టన్ వచ్చాడు. (లాస్ ఏంజెలెస్‌నుంచి) 'ఈయన అన్నిటినీ చెడగొట్టాడు. ఎందులోనూ 10 నిమిషాల

కంటే పాల్గొననిచ్చేవాడు కాదు! అతను వద్దంటే అసలే మానేసేది!' అని బాధ పడ్డాడు సెనోర్ తోబార్.

ఇదంతా ఇంతటితో ఆగలేదు.

తనకి ఉచితంగా లండన్‌కి తిరిగి వెళ్లేందుకు టిక్కెట్టు, 235 డాలర్లు కర్చులకీ, 350 డాలర్లు ఎకువడోర్ ఎయిర్‌లయిన్స్‌కోసం చేసిన ప్రచారానికీ, డేవిడ్ గార్టన్ పూర్తి కర్చులూ ఇస్తేగాని ప్రదర్శనలలో పాల్గొననంది!

'గత్యంతరంలేక అన్నీ ఇచ్చుకున్నాను,' అన్నాడు సెనోర్ తోబార్. 'లేకపోతే హోటల్ గదివదిలిరాదే! ఇంతచేసినా ఎన్నోప్రోగ్రామ్‌లు తప్పిపోయాయి'

తన కాంట్రాక్టు ఒకరాత్రి 12 గంటలకి అవగానే ఉదయం నాలుగుకి మిస్ ఫరీయా విమానం ఎక్కి పెరూ దేశంలోని లిమా అనే ఊరికి వెళ్లిపోయింది దానివల్ల ఎన్నో కార్యక్రమాలు చెడిపోయాయి; వేల టిక్కట్లు, కరపత్రాలు, ప్రకటనలు దండగ అయ్యాయి ఆమెకోసం ప్రత్యేకంగా కట్టిన ఒక ప్రదర్శనమందిరం కర్చులు దండగ అయ్యాయి.

ఆమె లండన్‌కి తిరిగిరాగానే కలిశాను.

'మళ్లీ అక్కడికి వెళ్లను!' అంది మిస్ ఫరియా కోపంగా 'మనుషులు మంచివారు కారు.'

'వాళ్లకి కోపం వచ్చిందిటగా! నాకూ వచ్చింది! ఒక్క ఏర్పాటు సరిగ్గా చెయ్యలేదు.

'ముందు విమానం చెడిపోయింది—అందుకనే 3 రోజులు ఆలస్యంగా వెళ్లాను. ఇక నే నెక్కడికి వెళ్లినా కిరీటం, గదా, నడుం చుట్టూ బెల్టూ తీసుకుపోవలసిందేనా? నా వెంట ఎంత సామానని తీసుకుపోగలను?

'మెక్కా వాళ్లు పంపించివ్వండవచ్చుకదా?'

మిస్ ఫరియా అంతటితో ఆగలేదు. 'విందు భోజనం బల్లల చుట్టూ ఈత సూట్లు వేసు కుతిరగమన్నారు. వాళ్లకి మతి పోయిఉంటుంది!' అంది. 'నేను ఈత సూట్లు వేసుకోనన్నానని అందరికీ మాన్పించేశారు!'

గార్టన్ సంగతి? 'అతన్నీ పిలిచారు.' అంది రీటా ఫరియా. 'ఇక్కడ ఉన్నాడని తెలిసి అధ్యక్షుడి భార్య ప్రత్యేకంగా ఆహ్వానం పంపింది'

'నన్నడగకుండా ఎకువడోర్ ఎయిర్‌లయిన్స్ వారు నా పేరు వాడుకున్నారు.

'డేవిడ్ నన్ను ఎక్కడా పదినిముషాలకన్నా ఉండనివ్వలేదా! అంతా వట్టిది! అధ్యక్షుడి భవనంలో 3 గంటలదాకా ఉన్నాము. మధ్య రాత్రిదాకా డాన్స్ చేశాము' అని నే నడిగిన మరొక ప్రశ్నకి సమాధానం చెప్పింది.

మెక్కా సంస్థతో పేచీలు?

'వాళ్లే వట్టి పేచీ మనుషులు! ఉదాహరణకి చెప్తాను మా అమ్మని దక్షిణ అమెరికాకి తీసుకుపోతానన్నాను. కర్చులన్నీ నీవే అన్నారు.

'అన్నీ నేనే పెట్టుకుని, నాకు వచ్చిన దాంట్లో 25 శాతం మెక్కాకి ఇస్తే నాకు ఏమిగాగలదే!

'అమెరికా అధ్యక్షుడికి తన రయిలు టిక్కట్లు కొనుక్కనే అవసరం లేదుట. తనకిమాత్రం అవసరం ఎందుకు కలగాలి?' అని అడిగింది మిస్ ఫరీయా రీవిగా.

మెక్కాసంస్థ వారు ఆమెకి ఒక చెలికత్తెని ఇచ్చారు. ఆమె పేరు ఆన్ గుడింగ్—

## ప్రపంచసుందరా....

24 ఏళ్ల యువతి.

'శీటా అన్ని పనులూ మమ్మల్నే చెయ్యమనేది. తన గదికివచ్చి తన వస్త్రాలని లాండ్రీకి పంపించటందాకా మాకే వప్ప చెప్పేది.

'ప్రపంచ సుందరి మా కూతురా? ఇటువంటివింత మేమెప్పుడూ చూడలేదు!

'ఉచితంగా మింక్ కోటు కొనిఇచ్చాము, అద్దె కార్లు కుదిర్చాము, ఎంతో సేవచేశాము

'కాని మా అందరి బతుకునీ దుర్భరం చేసేది. అమాంతంగా తన కార్యక్రమాలని రద్దుచేసేది. ఒకసారి బయట వాన కురుస్తోందని మా డయిరెక్టర్లలో ఒకరితో సమావేశం రద్దుచేసింది!'

ఇక ప్రపంచ సుందరి సంగతి.

నన్ను చూసి చక్కగా నవ్వింది.

'నేను చాలా చెడ్డదాన్ననుకుంటున్నారేమో అందరూ! నిజంగా చెడ్డదాన్నంటారా?' అని గునిసింది.

ఈ ప్రశ్నకి సమాధానం ఇవ్వగలిగినవాళ్లు ఇంగ్లండ్‌నుంచి ఎకువడోర్ దాకా ఎందరో ఉన్నారు.

—ఎరిక్ టయినన్

## చిత్రలహరి

'స్వయంవరానికి మీరూ వచ్చారా ?— రండి...రండి' అంటూ ఆహ్వానించాడు రామకృష్ణ, పి. యస్. ఆర్. పిక్చర్స్ వారి 'రణభేరి' సెట్స్‌లో. 'స్వయంవరం ఎవరికి?' అడిగాను. 'గీతాంజలికి !' 'స్వయంవరం హడావిడి ఏమీ కనిపించదేం ?' 'తొమ్మిది గంటలకే ప్రారంభం కావలసింది. కన్యారత్నం రానందున యింకా ఆరంభించలేదు' అన్నాడు రామకృష్ణ. దర్బారు సెట్. సెట్ నిండా మనుషులున్నారు వేషాల్లో. కళా దర్శకుడు కుదరవల్లి నాగేశ్వరరావు చాలా అందంగా డెకొరేట్ చేశారు ఆ సెట్‌ని. రాకుమారి దేవసేన (గీతాంజలి) వచ్చింది. స్వయంవరం ప్రకటించారు. ఆ స్వయంవరం సభలో కాంతారావు, రామకృష్ణ, జయకృష్ణ, ఉదయలక్ష్మి, తదితర సామంత రాజులు ఉన్నారు. ఎవరి స్థానల్లో వాళ్ళు నించున్నారు. 'టేక్' అన్నారు డైరెక్టర గిడుతూరి సూర్యం.

*   *   *

'ఏమండోయ్ జయలలితగారూ. మీరు పెళ్ళి చేసుకోకండోయ్!' అన్నాడు రాజ్‌బాబు. అతనికి కొంచెం అవతలగా నవ వధువులా పట్టుబట్టల్లో అలంకరించుకుని కూచున్న జయలలిత 'ఏం. అదేమిటి ?' అని అడిగింది. 'మీరు పెళ్ళి చేసుకుంటే మీ అభిమానులు చాలామంది చచ్చిపోతారు' అన్నాడతను. 'నేను ప్రతి చిత్రంలోనూ పెళ్ళి చేసుకుంటూనే వున్నాగా' బదులు చెప్పిందా అమ్మాయి 'అది వేరు. నిజ జీవితంలో మాట నే చెపుతున్నది!' అన్నాడు రాజ్‌బాబు.

అందంగా నవ్వింది జయలలిత.

గోల్డెన్ స్టూడియోలో సాయంకాలం ఆరున్నర ప్రాంతాల్లో విశ్వశాంతివారి 'సిలుపు



"గొప్పవారిగోత్రాలు'లో సురేఖ.

దోపిడి' చిత్రం సెట్స్ బయట జరుగుతున్న సందడి యిది. సెట్‌లోపల దర్శకుడు సి. యస్. రావు, దేవికతో షాట్ తీస్తున్నారు. షాట్ పూర్తయి నట్టుంది దేవిక యివతలికి వచ్చింది జయలలితకు లోపలికి రమ్మని సిలుపువచ్చింది,

*   *   *

'మీరు అంతకంతకూ చిక్కిపోతున్నారేమిటి, మేము లావైపోతుంటే ?' అన్నది నవ్వుతూ దేవిక. మళ్ళీ తనే అందుకుంటూ 'మీరు లావెక్కాలనీ, మేము (తారలం) సన్నబడాలనీ కోరుకోం దే' అన్నది. 'బాబ్డ్ హెయిర్'తో కాశ్మీర్ చీరలో ఎంతో అందంగా కనిపించిందాపూట దేవిక 'పెళ్ళిపోతు న్నారా ?' అని అడిగాను. 'అవును. మధ్యా

## సినిమా డైరీ

● హిందీ హాస్యనటుడు మహమూద్ యిప్పుడు తను నిర్మిస్తున్న 'పడోసన్' చిత్రంలో ఒక దృశ్యంలో నటించవలసిందిగా — ప్రముఖ భారతీయ హాస్యనటులందర్నీ కోరుతున్నాడు.

● అశోక్‌కుమార్ అహమ్మదాబాదులోని ఒక సభలో మాట్లాడుతూ 'జీవితంలో విజయం అనేది మిస్టరీ. జీవితం ఎపుడూ క్రమబద్ధంగా ఉండదు' అన్నారు.

● ఇపుడున్న పరిస్థితుల్లో 25 శాతం ఫిల్మ్ మాత్రమే బ్లాక్ అండ్ వైట్ పాజిటివ్ — సెప్టెంబరునుంచి డిసెంబరువరకు సప్లయి చేయగలదని హిందూస్థాన్ ఫోటో ఫిల్మ్ కంపెనీ ప్రతినిధి తెలియజేశారు. ఆ తర్వాతనుంచి పరిశ్రమకు అవసరమయినంతా హిందూస్థాన్ కంపెనీ అందజేయగలదని కూడా ఆయన చెప్పారు.

● 'హమ్‌రాజ్' నాయకి విమి — ఆ చిత్రం సెన్సారు అయినరోజున శాంతాక్రజ్‌లోని తన స్వంత భవనంలోకి మారింది. అంతకు ముందు దాకా ఒక లగ్జరీ హోటల్లో వుంటూ వచ్చింది.

● కేరెక్టర్ ఏక్టర్ బలరాజ్ సహానీకి తీరికవేళల్లో నవలలు రాయడం ఒక అలవాటు. ఈ సంవత్సరం షూటింగ్ విరామ సమయాల్లో ఆయన రెండు పుస్తకాలు రాశారు.

● వైజయంతిమాల మొదటిసారిగా 'ప్యార్ హి ప్యార్' చిత్రంలో ధర్మేంద్రతో కలిసి నటిస్తున్నది.

● 'జ్యువల్‌థీఫ్' చిత్రంలో నటి హర్యలోకి ఒక సన్నివేశంలో చీరకి బదులు పూర్తిగా నగలతో ఒక కాస్ట్యూమ్ వేశారు.

● ఫిలిమ్ ఫైనాన్స్ కార్పొరేషన్ కొత్త చెయిర్మన్‌గా శ్రీ హిమ్మత్‌సింహ్‌ని భారత ప్రభుత్వం నియమించింది.

● బొంబాయిలో నిర్మించబడుతున్న ఒక ఆసుపత్రికి నటి ఆశాపరేఖ్ రూ. 75,000 విరాళం యిచ్చింది.



శ్రీ ఎం. వి. ఆర్. పిక్చర్సు 'ప్రొడక్షన్ నెం. 1' ప్రారంభంలో దర్శకుడు మల్లికార్జునరావు, డా. రాండీ, జయలలిత, కృష్ణ, నాగభూషణం, నిర్మాత ఎం. వి. రామదాసు, సహ నిర్మాత బాజీరావు.

# చిత్రలహరి

ప్పామే వచ్చాను. రెండు షాట్స్ మిగిలిపోయినందువల్ల యిప్పటిదాకా ఉండవలసివచ్చింది.' అంటూ మేకప్ రూమ్సకేసి కదిలివెళ్లింది.

*  *  *

చుక్కమ్మ (సూర్యకాంతం) యింటి సెట్టుమీద ఆ రోజు చిత్రీకరణ జరుపుతున్నారు. అత్యంత వ్యయంతో సుందరంగా రూపొందించారు. ఆయింటి సెట్టుని, కళా దర్శకుడు కృష్ణా రావు. యన్. టి. రామారావు, కృష్ణ, పద్మనాభం, నాగభూషణం, రమాప్రభ ముఖ్య తారాగణంలో వున్నారు. ఇందులో రామారావుగారి రెండు కొత్త వేషాలు జనాన్ని విశేషంగా ఆకర్షిస్తవి. ఒకటి 'కోయదొర', మరొకటి 'వస్తాదు.' ఈ రెండింటినీ ఆయన యిదివరకు పోషించలేదు. దర్శకుడు : సి. యస్. రావు.

*  *  *

'ఐ యామ్ నాట్ ఫ్రీ ఫిజికల్లీ ఫ్రమ్ది లాస్ట్ టూ మంత్స్' అన్నారు, డైరెక్టర్ రావు సెట్స్‌లోకి వెళ్లినప్పుడు. నిజమే! రెండు నెలలుగా ఆయన ఎంతో బిజీగా వున్నారు. ఈ నాడు రావుగారు ఏడు చిత్రాలకు దర్శకత్వం నెరపుతున్నారు. 'ప్రతి నెలలోను మొదటి పదిరోజులూ రాజ్యం ప్రొడక్షన్స్‌కీ, ఆ తర్వాత పదిరోజులూ శ్రీకాంత్ ప్రొడక్షన్స్' 'గృహమే స్వర్గసీమ'కీ, మిగిలిన పదిరోజులూ 'విలువ దోపిడి' కీ పని చేస్తున్నాను. డిసెంబరుకి విలువదోపిడి పూర్తి అవుతుంది. అది కాగానే ఆ డేట్స్‌లో రవీంద్ర (హైదరాబాద్) వారిది తియ్యాలి. ఆ తర్వాత సుందర్‌లాల్ గారికి ఒకటీ, తారాచంద్ (రాజశ్రీ) గారికి రెండుచిత్రాలూ మొదలుపెట్టాలి' అన్నారు రావు, ఒక్క ఊపున.

**యంగర్ జనరేషన్‌కి అవకాశం!**

'తారాచంద్‌గారికి మీరుతీసే చిత్రాలు ఏవి?' అని అడిగినపుడు 'అనుపమ, చంద్రనాక్' అని చెప్పారు రావు. 'అనుపమ జనవరిలో ప్రారంభించాలను కుంటున్నాను. ఇందులో యంగర్ జనరేషన్‌కి అవకాశాలు కల్పిస్తున్నాం. మార్చినాటికి పూర్తిచేసి, ఏప్రిల్‌నుంచి 'చంద్రనాక్' మొదలు పెడతాం. ఇందులో నాగేశ్వరరావుగారు హీరో. కె. ఆర్. విజయ నాయిక. జూన్‌కి పూర్తి అవుతుంది.'

*  *  *

నిగూఢ భావాలను రమ్యంగా వెండితెర కెక్కించిన ఘనత శ్రీ ఏ. సంజీవికి దక్కింది. ఫిల్మ్ ఎడిటర్‌గా విశేషమయిన అనుభవం గడించినందువల్లనే ఆయన 'ఇల్లాలు' చిత్రాన్ని హృద్యమంగా తీయగలిగారు. ఇపుడు సంజీవి కల్పన చిత్రవారి 'అత్తగారు— కొత్తకోడలు' చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. దసరానాడు యీ చిత్రనిర్మాణ కార్యకలాపాలు ఆరంభమయినవి. సత్యనారాయణ, హరనాథ్, కృష్ణ — అన్నదమ్ములు. వాసంతి, భారతి, విజయనిర్మల కోడళ్లు. సూర్యకాంతం అత్తగారు. ఆమె కూతురు రమాప్రభ, అల్లుడు రాజ్‌బాబు. వియ్యంకుడు అల్లురామలింగయ్య. పినిశెట్టి రచయిత. జి. కె. వెంకటేష్ సంగీత దర్శకుడు, యస్. వెంకటరత్నం ఛాయాగ్రాహకుడు, సినిమా అనుకరణ, కూర్పు, దర్శకత్వం : ఏ. సంజీవి. బాబూరావు నిర్మాత.

—మోహన్ కుమార్ ●

## మహాడో మనిషి

(10 వ పేజీ తరువాయి)

చాలా కష్టతరమైన పని, కాని ఓర్పుకి ఫలితం దక్కకపోదు. 'ఇటువంటి నిండైన యిల్లాలిని కాదని ఎక్కడికీ వెళ్లను' అనిపించి భర్త తప్పక సుముఖుడు కావడమే కాదు కుటుంబాని కిదివరలో కన్నా చేరువ అయే అవకాశం కూడా ఉంది. అటువంటి అవకాశాన్ని కాలదన్నే గృహిణి ఇంగితం లేనిదని పించు కుంటుంది. పురుషుడు కూడా పసివాని మనస్తత్వంతో ఉంటూ ఉంటాడు. లోగడ తల్లిదగ్గిర మెప్పు పొందినట్లే తరువాత భార్య దగ్గిర పొందాలని తాపత్రయ పడని మగవా డుండడు. తల్లి పిల్లాడు తప్పు దారిన పట్టినా అభిమానంతో ప్రేమతో దోవ మళ్లించదా? భార్య మటుకు ఎందుకు చేయకూడదు? ●

**అవీ—ఇవీ...**

## కుమారి కల్యాణి రంగ ప్రవేశం

శ్రీ వెంపటి చిన సత్యం శిష్యురాలయిన కుమారి కల్యాణి మద్రాసులోని శ్రీకృష్ణ గాన సభలో రంగప్రవేశం చేసింది. కార్యక్రమానికి శ్రీ జగ్గయ్య అధ్యక్షత వహించారు శ్రీ బి యన్ రెడ్డి ప్రసంగించారు.

కుమారి కల్యాణి.

ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ యమ్ జి. రామచంద్రన్ కుమారి కల్యాణి ప్రతిభని కొనియాడుతూ ఒక బంగారు గొలుసుని బహూకరించారు. శ్రీ వెంపటి చినసత్యం గారిని శాలువాతో సన్మానించారు.

కుమారి కల్యాణి రంగప్రవేశానికి ముందు కుమారి యశోద, కుమారి దుర్గ నాంది స్తుతి చేశారు.

శ్రీ వెంపటి చినసత్యంగారి నట్టువాంగమూ, శ్రీమతి జి. వైదేహి గాత్రం నృత్యానికి ప్రత్యేకతను చేకూర్చాయి.

కూచిపూడి నృత్యానికి కుమారి కల్యాణి మరో కాంతికిరణం. ఆమె అతిత్వరలో అగ్రస్థానాన్ని అలంకరిస్తుందని ఆశించుదాం.

—సిత రాజు ●

## లిట్ క్విజ్ నెం. 23

## 17 శ్లోలకు తెలుగు అనువాదం

1. అజంతా యందలి కళ అస్తిత్వము యొక్క సౌందర్యముకు / ఐక్యముకు రహస్యమును వెల్లడించుచున్నది.
2. కర్తవ్యము/మానవత్వము యందలి ప్రీతి తన్నుతాను మరపింపజేస్తుంది.
3. జీవిత తత్వజ్ఞానము లేని విద్యకు / మతముకు నిజమైన విలువలేదు.
4. సామాజిక మరియు ఆర్థికసమత్వము లేని రాజకీయ సమత్వము /స్వతంత్రమువట్టి హాస్యాస్పదము.
5. మతస్వాతంత్ర్యం మరియు సామాజికన్యాయం/ సుమేళవం భారతరాష్ట్రము యొక్క ధర్మని రాపే కు నిజంగా ఈ రెండును మూలములై యున్నవి.
6. మనము నిజంగా దేవునియందు ఆయనకున్న అనంతమైన శక్తి, కరుణయందు విశ్వాసమును గలిగి యున్నయెడల మనమెప్పటికి దేనికిన్ని భయపడము/కోపగించము.
7. మన దుర్బలత్వంవల్ల మనం నిస్పందేహంగా తరుచు పూర్తిగా అసహాయులము, దుస్సాహసులము అయిపోతాము.
8. జనులు క్రొత్త ఆదర్శములను / కల్పనలను తక్షణం అవలంబించరు.
9. దేవుడు ఒక్కడే అయితే విడువని ఎక్కువ దౌర్జన్యం ఎందుకు సంభవిస్తుంది? ఆయన భక్తుల అజ్ఞానము / అసహనంవల్లనే.
10. నవనాగరికమానవుడు మతహీనుడు/బాధ్యతాహీనుడు అయిపోయి స్వార్థహేతుపూర్వకమైన సౌఖ్యానందములను ఆశించుచున్నాడు.
11. జీవము/ప్రకృతి యొక్క గూఢార్థమును తెలుపరచుటకు నిశ్చయంగా మనకు యదార్థములు కావలెను.కల్పనలువలదు.
12. మనలో ప్రతి ఒక్కరున్ను దేవుని వలెనే నిత్యమైనవారు అమరులు మరియు నిగూఢశక్తివంతంగా/యదార్థంగా దైవమే.
13. సంపూర్ణ ఆత్మ సంయమం అంతరంగ పవిత్రత/శాంతము సాధింప సాధ్యమగును. దానివల్ల స్వార్థమైన మరియు స్వకీయమైన మనోభీష్టములన్నిటినుండి మనంతటమనము విముక్తులమగుదుము.
14. బానిసలకు ఆదరణ/ప్రశాంతి లేదు.
15. అమాయికత్వము నిస్వార్థత/సత్యసంధతలకు అత్యంత అగ్రదశ మరియు దివ్యలక్షణము.
16. ఒక రాష్ట్రం ఎక్కువగా అభివృద్ధి పొందుచున్నకొలదీ అందలి ప్రజలు ఎక్కువగా అపాయం పాలై / అస్వస్థంగాను దుఃఖంగాను వుండుట విపాదకరం.
17. సదా పవిత్రుడు, సదా తేజోవంతుడైన, ఈశ్వరుడు సర్వదా సర్వాంతర్యామియై ఎల్లెడలా ప్రకటమై యున్నాడు. కాని హృదయములు అపవిత్రమై లేక చపలమై/అయోగ్యమై యున్నయెడల మన హృదయములందు యథాయోగ్యంగా ప్రతిబింబించవు.

(ఎంట్రీ ఫారమునకు ఎదురుపేజీ చూడండి)

# వనితలకి వ్యాయామం

(13 వ పేజీ తరువాయి)

పక్కకి తిప్పాలి. తరవాత ముందుకి ఝూడించి దింపాలి. అప్పుడే చీలమండ దగ్గర పాదం నిరారుగా సాగతీయటం మరిచి





పోకూడదు. ఒక్కొక్క కాలు అయిదుసార్లు చేయాలి గోడకి రెండు చేతులూ ఆన్చి నిలబడి కాలు ఎంత దూరం వీలైతే అంత దూరం పై వైపుకి సాగతీయాలి తరువాత వెనక్కీ ముందుకీ ఝూడించాలి. ఇలా ఒక్కొక్క కాలుకి అయిదుసార్లు చేయాలి.

ఇవి చేసేటప్పుడు గూనిగా నిలబడకూడదు. ఒక కాలు చేస్తున్నప్పుడు రెండో కాలు మోకాలుదగ్గర వంగిపోనీయ కూడదు.

## అందమైన కాళ్లు

గోడకి ఆనుకుని ముంగాళ్ల మీద కూర్చుని నెమ్మదిగా మునివేళ్లమీద ఆను



కోవాలి. ఇలా నడుము వంచకుండా అయిదు సార్లైనా చేయాలి. కాలుకి అంతకీ ఇది వ్యాయామం అవుతుంది.

## అందమైన ఆకృతి

నేలమీద కాళ్లు నిటారుగా జాపుకొని కూర్చోవాలి. చేతులు ముందుకు భుజాలతో సమానంగా చాపి ఉంచాలి. అలా కూర్చుని పిరుదులపై బరువంతా ఆన్చి, ముందుకి పది



అడుగులు, వెనక్కి పది అడుగులు జరగాలి. అనవసరపు కండలు కరిగిపోయి నడుము కింద నుంచి తొడలదాకా చక్కని ఆకారం తేలుతుంది.

—కె. రామలక్ష్మి

# LITQUIZ No. 23

# Rs. 26,000

FIRST PRIZE Rs. 13,000

RUNNERS-UP UP TO 4 ERRORS Rs. 7,000

MINIQUIZ UP TO 2 ERRORS Rs. 5,000

FAMINE RELIEF FUND: Rs. 1,000

ఆఖరు స్వీకరణ తేది: 12-10-67.
సొల్యూషన్ భారత్ జ్యోతిలో: 15-10-67.
ఫలితాలు భారత్ జ్యోతిలో: 29-10-67.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను *లిట్ క్విజ్ వీక్లీ 10సం చికలకు - 2 పంపవలెను. * వీరా ఎంట్రీలను 11-10 67 బుధవారమునాడు కూడా పంపవచ్చును. కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను.

## లిట్ క్విజ్ నెం. 23 అధికార ఎంట్రీ ఫారము

ADDRESS
LITQUIZ No 23, ALANKAR, BALARAM ST., BOMBAY-7(WB)

షరా:- (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయుండి. (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో రెండవకూపన్ కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీఫారమునకు జతపరచవలెను. M O రసీదు లేని ఎంట్రీ నిరాకరింపబడును. (4) I.P.O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 23, బొంబాయి-7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| 1 | Re. 1 | | 2 | Re. 1 | |
|---|---|---|---|---|---|
| 1 | BEAUTY | UNITY | 1 | BEAUTY | UNITY |
| 2 | DUTY | HUMANITY | 2 | DUTY | HUMANITY |
| 3 | EDUCATION | RELIGION | 3 | EDUCATION | RELIGION |
| 4 | EQUALITY | LIBERTY | 4 | EQUALITY | LIBERTY |
| 5 | EQUITY | HARMONY | 5 | EQUITY | HARMONY |
| 6 | FEARFUL | RESENTFUL | 6 | FEARFUL | RESENTFUL |
| 7 | HELPLESS | RECKLESS | 7 | HELPLESS | RECKLESS |
| 8 | IDEALS | IDEAS | 8 | IDEALS | IDEAS |
| 9 | IGNORANCE | INTOLERANCE | 9 | IGNORANCE | INTOLERANCE |
| 10 | IRRELIGIOUS | IRRESPONSIBLE | 10 | IRRELIGIOUS | IRRESPONSIBLE |
| 11 | LIFE | NATURE | 11 | LIFE | NATURE |
| 12 | POTENTIALLY | TRULY | 12 | POTENTIALLY | TRULY |
| 13 | PURITY | TRANQUILLITY | 13 | PURITY | TRANQUILLITY |
| 14 | RESPECT | REST | 14 | RESPECT | REST |
| 15 | SELFLESSNESS | TRUTHFULNESS | 15 | SELFLESSNESS | TRUTHFULNESS |
| 16 | UNEASY | UNHAPPY | 16 | UNEASY | UNHAPPY |
| 17 | UNSTEADY | UNWORTHY | 17 | UNSTEADY | UNWORTHY |

SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE

MiniQuiz




NO. 23

| | | | |
|---|---|---|---|
| BEAUTY | UNITY | IDEALS | IDEAS |
| DUTY | HUMANITY | LIFE | NATURE |
| EQUALITY | LIBERTY | RESPECT | REST |
| FEARFUL | RESENTFUL | UNEASY | UNHAPPY |
| HELPLESS | RECKLESS | UNSTEADY | UNWORTHY |

**23** (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారం ఎంట్రీ ఫీజు రు. 2/- M.O. రసీదు/ I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను.
వాటి నెం. ..............................

CAPITAL LETTERS

NAME..............................

ADDRESS..............................

..............................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

## 17 CLUES

1. The art of Ajanta unfolds the secret of the **Beauty/Unity** of all existence
2. It is love for **Duty / Humanity** which makes one forget one's self.
3. No **Education / Religion** is of real value without a philosophy of life.
4. Political **Equality / Liberty**, without social and economic equality, becomes a farce.
5. Religious freedom and social **Equity / Harmony** are infact, the two foundations on which the secularity of the Indian state is based.
6. If we really have faith in God and in His infinite power and goodness we can never feel **Fearful / Resentful** about anything.
7. In our weakness we are, no doubt, often quite **Helpless / Reckless**.
8. People do not embrace new **Ideals / Ideas** all at once.
9. Why is there so much persecution if God is one? Because of the **Ignorance/ Intolerance** of His believers.
10. The modern man is **Irreligious / Irresponsible**, seeking pleasure for selfish purposes
11. Most certainly we do want facts and not fiction to slove the enigma of **Life / Nature**
12. Every one of us is like God, eternal immortal, and **Potentially / Truly** divine.
13. Inner **Purity / Tranquillity** is achieved by complete self-abnegation, as by it we free ourselves from all selfish and personal desires.
14. There is no **Respect / Rest** for slaves.
15. Simplicity is the highest stage of **Selflessness / Truthfulness** and is a sublime trait.
16. It is a tragedy that the more advanced is a state the more insecure and **Uneasy / Unhappy** are its people.
17. Iswara the ever pure and ever bright is ever and everywhere present but cannot be properly reflected in our minds if they are impure or **Unsteady / Unworthy.**

గమనిక : పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకముల నుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురించబడును.

## జవాబులు

A నుంచి D కి వెళ్ళే తెల్ల రైలు 3 భాగాలుగా విభజింప బడింది. అవి 7 బోగీలు, 8 బోగీలు, 1 బోగి. D నుంచి A కి వెళ్ళే నల్ల రైలు అసలు ఎప్పుడూ విభక్తమే కాదు. మొదటి బొమ్మలో తెల్ల రైలులోని 8+1 బోగీలను మిగిలిన పెట్టెల నుండి విడదీయడం కనబడుతుంది. రెండవ బొమ్మలో నల్ల రైలు 8+1 తెల్ల పెట్టెలను ఎదరకు తోసుకుపోతుంది. తెల్ల రైలు 7 పెట్టెలను తీసుకుని D




వైపు వెడుతుంది. నల్లరైలు 8 తెల్ల పెట్టెలను తీసుకుని వెనక్కి వస్తూ లూప్ మీద ఆ 8 బోగీలను వదిలి D వైపు వెడుతుంది.

తరువాత నల్లరైలు A వైపు వెళ్ళి, మిగిలి ఉన్న ఒక్క తెల్ల బోగీని తగిలించుకుని, వెనుకకు ప్రయాణమై దారిలో లూప్‌మీద ఉన్నది పెట్టెలను గెంటుకుని, లూప్‌మీద తెల్ల పెట్టెను ఒక్కదానిని విడిచి పెడుతుంది.

తరువాత నల్లరైలు A వైపుగా సాగి పోతుంది. తెల్లరైలు లూప్ మీద మిగిలి

## మెదడుకి మేత

(35 వ పేజీ తరువాయి)

పోయిన తన పెట్టెను తగిలించుకుని D వైపు ప్రయాణమై పోతుంది.

* * *

(చ) $21 \times 87 = 1827$

$27 \times 81 = 2187$

$35 \times 41 = 1435$

గుణించవలసినవి రెండు అంకెల సంఖ్యలు మాత్రమే అయితే ఈ నాలుగు తప్ప మరి ఇటువంటివి లేవు. ఈ నియమం లేకపోతే మరి కొన్ని :

$8 \times 473 = 3784$

$9 \times 351 = 3159$

$3 \times 51 = 153$

$6 \times 21 = 126$

* * *

(ట) ఆరు బాణాలు కావాలి. 17, 17, 17 17, 16, 16 అనే సున్నాలలో కొట్టాలి.

(త) 6 అంకె ఉన్న పిల్లవాడు తల కిందులుగా నిలుచుని, 931 అనే సంఖ్యను తయారు చెయ్యాలి. ఇందులో 7 నిశ్శేషంగా పోతుంది.

## బాలసాహితి

(34-వ పేజీ తరువాయి)

నది దాటివచ్చిన పడవలన్నీ కాలి పోయేయి. అందుచేత మనం తిరిగి మనదేశం వెళ్ళడానికి అవకాశం లేదు. ఇప్పుడు మనకు రెండే మార్గాలు ఉన్నాయి. ఒకటి వాయవ్య దేశపు రాజును ఓడించి అతని దగ్గరఉన్న పడవలను స్వాధీనం చేసికొనడం, రెండవది మనం అతనికి లొంగిపోయి ఖైదీలు కావడం. మీరే ఆలోచించండి ఇంత వరకు మనం అశ్రద్ధ చేయడంవల్లనే వాయవ్య దేశపురాజు యింత బలాన్ని సమకూర్చుకొన గల్గేడు అందుచేతనే నేను యిటువంటి చర్యను తీసికొన వలసి వచ్చింది.

ఆ మాటలు వినగానే సైనికులకు పరిస్థితి అర్థమైంది. దానితో వారికి పూర్తిగా యుద్ధోత్సాహం కలిగింది. మల్లన్న మంత్రి సైన్యం అప్పుడు ప్రాణాలకు తెగించి పోరాడి వాయవ్య దేశపు రాజును ఓడించి వేసింది.

---

## విజయీభవ!

(61 వ పేజీ తరువాయి)

'ఏమి టాలోచిస్తున్నావ్ ?' — అని బృహన్నల.

'ఈ నాడు జనాభా విపరీతంగా పెరిగి పోతూందికదా? — ఈ కురువీరులందరికీ ఫామిలీ ప్లా...?'— ఉత్తరుడి ప్రశ్న.

గొల్లున నవ్వారు ప్రేక్షకులు. కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి.

పాత పురాణానికి మోడరన్ టచ్! — భేష్. బాగుంది అన్నారు రసికులు. ఇది కాల గణనదోషం (అనాక్రానిజమ్) కాదా అని అడిగారు, విమర్శకులు.

దిగ్విజయం— అన్నారు, నిర్వాహకులు.

—ఖుషీరామ్

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1 Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

